# షార్ట్ ఫిల్మ్‌లో

మన స్టార్ హీరోయిన్లు ఇపుడు వెండితెరపై అలరిస్తూనే డిజిటల్ ప్లాట్ ఫామ్‌లో కూడ కొన్ని షార్ట్ ఫిల్మ్స్‌లో కన్పిస్తున్నారు.. ఏదైనా మంచి సోషల్ మెసేజ్ ఉన్న షార్ట్ ఫిల్మ్ అయితే ఆ ఫిల్మ్ ఎంత చిన్నది అని చూడకుండా వాళ్ల వంతు సహాయం అందిస్తూ ఉంటున్నారు.. ఇపుడు అదే బాటలో మరో సౌత్ స్టార్ హీరోయిన్ ఒక షార్ట్ ఫిల్మ్‌లో నటించింది. నటుడు, రాజకీయ నాయకుడైన శత్రఘ్న సిన్హా కుమారుడు, హీరోయిన్ సోనాక్షి సిన్హా తమ్ముడు, కుష్ సిన్హా తీసిన ఒక హిందీ షార్ట్ ఫిల్మ్‌లో నటించింది కాజల్ అగర్వాల్... ఖూన్ మైన్ హై అనే షార్ట్ ఫిల్మ్‌లో బాలీవుడ్ హీరో ఆయుష్మాన ఖురానా తమ్ముడు అపార్‌శక్తితో కలిసి నటించింది. ఈ సినిమా గురించి కుష్ సిన్హా మాట్లాడుతూ ఈ షార్ట్ ఫిల్మ్ ఒక ఢిల్లీ అబ్బాయి-ఒక ఢిల్లీ అమ్మాయి మధ్య జరిగిన కథ. ఈ ఫిల్మ్‌లో ఢిల్లీ హిందీ యువ ముంబాబు ప్రేక్షకులకు కొంచెం కొత్తగా అన్పించవచ్చు.. ఫిల్మ్‌ను మేం విరామం లేకుండా 18 గంటలు షూట్ చేసి పూర్తి చేశాము' అని తెలిపారు..



# ఒకటి కాదు రెండుసార్లు..

పరిచయం చేయాల్సిన అవసరం లేని టాలీవుడ్ హీరోయిన్ రకుల్‌ప్రీత్ సింగ్.. తాజాగా ఒక మీడియా ప్రత్యేక ఇంటర్వ్యూలో ఆసక్తికరమైన అంశాల్ని చెప్పుకొచ్చింది. రీల్ లైఫ్‌లో సరే. రియల్ లైఫ్‌లో ఎవరినైనా చెప్పుతో కొట్టారా? అన్న ప్రశ్నకు ఒకసారి కాదు. రెండుసార్లు చెప్పుతో కొట్టిన విషయాన్ని చెప్పింది.. కాలేజీ రోజుల్లో ఒకసారి చెప్పుతో కొట్టానని, రెండోసారి ఫోరం మాల్‌లో కొట్టినట్టుగా చెప్పింది. బ్రదర్‌తో.. ఒక స్నేహితుడితో సినిమాకు వెళ్లానని, వెనక్కి తిరిగే సమయానికి ఒక వ్యక్తి ముఖానికి దగ్గరగా రావటంతో ఒళ్లు మండిందని, సెల్ఫీకోసం వచ్చినట్టు చెప్పిన అతడ్ని గట్టిగానే కొట్టినట్టు పేర్కొంది.

# కవర్ ఎక్కిన శివగామి

రమ్యకృష్ణ.. హీరోయిన్‌గా ఎంత పేరు సంపాదించిందో హీరోయిన్‌గా కెరీర్ ముగించి మళ్లీ బాహుబలి సినిమాలో ప్రభాస్ రానాలకు అమ్మగా చేసి ఇంటర్నేషనల్ ప్రేక్షకులను సైతం ఆకట్టుకుంది. తాజాగా ఫ్యాషన్ మ్యాగజైన్ కవర్‌పై మెరిసింది రమ్యకృష్ణ యంగ్ కాకపోయినా హాట్ కాదు అని మాత్రం అనలేం. ఇపుడు అమ్మ పాత్రలు చేస్తున్నా అంతే హాట్‌గా కన్పిస్తోంది. ఇక్కడి రమ్య ఫొటో ఫోజు చూస్తే.. అమ్మాయిలే కాదు అమ్మపాత్రలు చేస్తున్న హీరోయిన్లు కూడ అందంగా ఉంటారు అని చెప్పక తప్పటం లేదు..

కె.లీలా సువర్ణ




13 ఆగస్టు 2017

## విషయ విశేషం



## మంచి ముత్యాలు

విద్య అనేది శాస్త్రాలను వివరించేందుకే పరిమితం కారాదు. ఒక పరిపూర్ణమైన మానవుని తీర్చిదిద్దేదే అసలైన విద్య.
-రవీంద్రనాథ్ ఠాగూర్






## లేఖలు

### ఆలోచింపజేసింది..

జూలై 30 వార్త ఆదివారం అనుబంధంలో 'ఏదీ దారి?..గంగ, యమున, కావేరి' దేశంలోని నదుల స్థితిగతులకు అద్దంపట్టింది. నీటి వనరులైన నదులను చేతు లారా కాలుష్యకాసారాలను చేయ టం శోచనీయం. గంగానది శుద్ధికి ఎంత వ్యయ ప్రయాసలు పడుతు న్నామో అర్థంచేసుకుని ఇకముందైనా పౌరులందరూ బాధ్యతాయుతంగా మెలగాలి.

-ఎన్.శ్రీనివాస్, వరంగల్;
జి.సుధాకర్, తిరుపతి.

### ఆర్టికల్ బాగుంది..

జూలై 30 వార్త ఆదివారం అనుబంధం లో ప్రచురించిన 'తెలుగు కవితకు వెలుగు నిచ్చిన కవి' ఆర్టికల్ చదివి ఆనందసాగరంలో మునిగాను. జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు గతంలో తమిళనాడులోని హోసూర్‌లో జరిగిన సాహిత్యసభకు విచ్చేసినపుడు పద్యాలను ఆలపించగా విని తన్మయులమయ్యాం. ఆయన రచించిన పుష్ప విలాపం చదివి, విని పులకించనివారుండరు. వారిని ప్రత్యక్షంగా చూడగలగటం నా భాగ్యంగా భావిస్తాను.

-కైప.నాగరాజు, అనంతపురం.

### మాకెంతో నచ్చింది

వార్త ఆదివారం మేగజైన్ జూలై 30 సంచికలో భావవీచిక-వందేమాతరం, 'సంఘీ' భావం' శీర్షిక పిల్లల పెంపకమే కీలకం బాగు న్నాయి. 'మొగ్గ'లోని అన్నదమ్ముల స్నేహం చక్కని ఆదర్శవంతమైన కథగా మలిచారు. 'అనుమానం ప్రేమాంతకం' ప్రేమకథామాలిక హృదయాలను ద్రవింపజేసింది. 'అతడు-ఆమె' కథ బాగుంది. రచయితలకు ధన్యవాదాలు.

-గురారెడ్డి, నిజాంపేట.

### మేగజైన్ మురిపించింది

జూలై 30 వార్త ఆదివారం మేగజైన్ ఆద్యంతం ఎంతో మురిపించింది. పిల్లల పెంపకంపై 'సంఘీ'భావం టైమ్లీగా ఉంది. 'భావవీచిక' దేశభక్తి భావనను నొక్కిచెప్పింది. 'అతడు-ఆమె' కథ చాలాబాగుంది. కవర్‌స్టోరీ నదీకాలుష్యం గురించి ఎన్నో వివరాలందిం చింది. కవితలలో భావనాబలం, కవితావైచిత్రి తొంగిచూశాయి.

-శివలెంక చంద్రశేఖర్, మెహదీపట్నం;
డా.శివ భూషణం, కర్నూలు.

### ఏకీభవిస్తున్నాం.

జూలై 30 వార్త ఆదివారం మేగజైన్‌లో 'ఈవారం కవిత్వం' లో పుట్టిగిరిధర్ కవిత పచ్చనిబంధం అక్షరసాక్షిగా పరిపుష్టంచేసింది. 'మూడోకన్ను'లో ఓటర్ల రాజకీయం అంశంతో శతధా ఏకీభవిస్తున్నాను. శ్రీదేవితో దర్శకేం ద్రుడి సిల్వర్ జూబ్లీ మూవీ ఆలోచన కార్య రూపం దాల్చి విజయవంతం కావాలని అభిల షిస్తున్నాం. బ్యాక్ కవర్ 'బాతుల బాతాఖానీ' ఆకట్టుకుంది.

-నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం.

## భావ వీచిక



### స్వాతంత్రం ఓ హక్కు..బాధ్యత

మనిషికి ఆనందానికి మూలం స్వేచ్ఛా స్వాతంత్ర్యాలే. అవి లేని జీవితాన్ని ఊహించుకోలేం. భారతదేశం బ్రిటిష్ వారి పాలనలో వందలాది ఏండ్లు మగ్గి, ఎందరో మహనీయుల కృషి ఫలితంగా, అనేకానే కుల పోరాటాలు, త్యాగాల ఫలితంగా ఎట్టకేలకు ఆగస్ట్ 15, 1947న స్వాతం త్ర్యాన్ని పొందగలిగింది. మనం ప్రస్తుతం ఇంత స్వేచ్ఛగా ఉండగలుగుతున్నామంటే అది ఆనాటివారి వెలలేని త్యాగాలవల్లే. మనిషి స్వతహాగా స్వేచ్ఛా స్వాతంత్ర్య పిపాసి. అయితే ఎవరికి వారు స్వేచ్ఛా స్వాతంత్ర్యాల పేరిట అర్థరహితంగా మెలిగితే అది ఇతరులకు ఇబ్బంది కలిగిస్తుంది, ఇక్కట్లను తెచ్చిపెడుతుంది. వాక్స్వాతంత్ర్యం ఉంది అంటే ఏ విషయం పై అయినా తమ అభిప్రాయాలను జంకులేకుండా చెప్పటానికే. కానీ అలా అని ఇతరులను దుర్భాషలాడుతూ, కించపరుస్తూ మాట్లాడటం క్షంతవ్యం కాదు. ఇతరుల అభిప్రాయాలను వ్యతిరే కించే సందర్భంలోనూ, ఇతరుల తీరును విమర్శించే సమయంలోనూ కూడా వ్యక్తిగత దూషణలకుదిగడం, అనుచిత భాషను ఉప యోగించడం పద్ధతికాదు. ఆర్థిక స్వాతం త్ర్యం విషయానికి వస్తే ఆర్థిక స్వాతంత్ర్యం హక్కు రాజ్యాంగం ఇచ్చినా ఇప్పటికీ ఎంతో మందికి అది అందని పండుగానే ఉంది. మనిషి ఒక విషయాన్ని సదా గుర్తుంచుకో వాలి. తన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు, ఇతరుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను దెబ్బ తీసేవిగా ఉండకూడదు. ఇతరుల స్వేచ్ఛా స్వాతం త్ర్యాలను గుర్తిస్తూ, గౌరవిస్తూ తమస్వేచ్ఛా స్వాతంత్ర్యాలను పరిరక్షించుకునే పద్ధతిని అందరూ అనుసరించాలి. విశృంఖలత స్వేచ్ఛకాదు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను అభిలషణీయ పద్ధతిలో ఉపయోగించుకో వాలి. ఇంకొందరు తమకు ఇంట్లో స్వేచ్ఛ లేదని వాపోతుంటారు. స్వేచ్ఛ అనేది ఒకరు ఇస్తే వచ్చేదికాదు. ఎవరికి వారు దాన్ని సాధించుకోవలసిందే. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను సద్వినియోగం చేసుకునే బాధ్యతను ప్రతివారు గుర్తుంచుకోవాలి. పరస్పర స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను గౌరవించు కోవాలి. ఏమైనా 'నాదీ స్వతంత్ర దేశం, నాదీ స్వతంత్ర జాతి' అనుకోవడం భారతీయులందరికీ గర్వకారణం!

'సంఘీ'భావం



# జల వనరులకు ప్రాణం ఇవ్వండి!

దేశంలోని జీవనదులన్నీ జీవం కోల్పోతున్నాయి. మనిషి స్వార్థానికి అవి మృత్యుకళేబరాలుగా మారుతున్నాయి. ఇప్పటికే జీవ నదులన్నీ 50 శాతందాకా నీరు లేక ఎడారులను తలపిస్తున్నాయి. 2030 నాటికి కూడా జీవనదులను మానవులు తమ స్వార్థానికి బలి చేయడం ఆపకుంటే జీవనదుల ఉనికే ప్రశ్నార్థకంగా మారుతుంది. జీవనదులకు కూడా మానవులు రాజ్యాంగం కల్పించిన చట్టబద్ధ హక్కులు ఇవ్వాలని, వాటికి జీవించే హోదా (living status) ఇవ్వాలని, వాటిని నిర్వీర్యం చేసేవారిపై దౌర్జన్యం, హత్య లాంటి కేసులను కూడా నమోదు చేయాలని ఉన్నత న్యాయస్థానాలు ఇటీవల సంచలన తీర్పు ఇవ్వడంతో దేశవ్యాప్తంగా నదుల మనుగడపై అందరిలో ఆలోచన మొదలైంది. ఎవరైనా వ్యక్తిపై దాడి చేస్తే లేదా హత్యాయత్నం చేస్తే వారిపై క్రిమినల్ కేసులు నమోదు చేస్తారు. అలాగే జీవనదుల ప్రవాహాన్ని అడ్డుకున్నా వాటిని కాలుష్యభరితం చేసినా ఆక్రమణలు చేసినా క్రిమినల్ కేసులు పెట్టాలని నదులను కూడా జీవించే మనుషులుగానే పరిగణించాలని ఉన్నత న్యాయస్థానం అరుదైన తీర్పును ప్రకటించిన తరువాత ఆయా రాష్ట్రాల్లో, ప్రభుత్వాల్లో, పాలకుల్లో, ప్రజల్లో కదలిక మొదలైంది. జలవనరులే మానవ జీవనానికి మనుగడ అని ప్రతిఒక్కరు గుర్తించే పరిస్థితి ఏర్పడింది. న్యాయస్థానాలు తీర్పులు ఇస్తే తప్ప పాలకులు, పాలితులు కదిలే పరిస్థితి రాని దయనీయ స్థితిలో మన సమాజం ఉంది. నదులకు లివింగ్ స్టేటస్ ఇవ్వాలని కోర్టు ప్రకటించిన తరువాత బిజెపి పాలనలోని మధ్యప్రదేశ్ ప్రభుత్వం అక్కడి ప్రజల జీవనాడిగా ఉన్న నర్మదా నదికి కూడా లివింగ్ స్టేటస్ ఇచ్చింది. కోర్టులు దేశంలో అతిపెద్ద నదులైన గంగా, యమునలకు లివింగ్ స్టేటస్ ఇచ్చిన తరువాత మధ్యప్రదేశ్ ప్రభుత్వం కూడా స్పందించింది.

ఇదే దిశలో దేశంలోని అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్ర పాలిత ప్రాంతాలు జలవనరులకు లివింగ్ స్టేటస్ ఇచ్చి, వాటికి భంగం కలిగించే వారిపై కేసులు పెట్టి శిక్షలు వేస్తే తప్ప జలవనరులకు మనుగడ కనిపించడం లేదు. కన్యాకుమారి నుంచి హిమాలయాల వరకు పెద్ద నదులే కాక వాటి ఉపనదులు కూడా మనిషి స్వార్థానికి మనుగడ లేకుండా పోయాయి. వాటి తరువాత చిన్న నీటివనరులైన చెరువులు, కుంటలు, వాటికి నీరందించే ఫీడర్ చానల్స్ కూడా ఆక్రమణలకు గురై నీరు నిలిచే పరిస్థితి దాపురించింది. చివరకు 47 శాతందాకా నీరు నిలిచే పరిస్థితి లేని స్థితిలో జలవనరులు ఉన్న పరిస్థితుల్లో న్యాయస్థానాలు స్పందించడంతో పర్యావరణవేత్తల్లో, మేధావుల్లో హర్షాతిరేకాలు వ్యక్తమవుతున్నాయి. ఇప్పటిదాకా పర్యావరణవేత్తల ఆందోళనలను, నిరసనలను పట్టించుకునేవారు కరువయ్యారు.

చివరకు ప్రజా ప్రయోజన వాజ్యాలతో కోర్టులు స్పందించి లివింగ్ స్టేటస్ గంగా, యమునల నుంచి ప్రారంభించడం అందరిలో సంతోషాన్ని నింపుతున్నది. కోర్టుల తీర్పు స్ఫూర్తితో ఇషా ఫౌండేషన్ వ్యవస్థాపకుడు జగ్గీ వాసుదేవ్ కూడా స్పందించి ర్యాలీ ఫర్ రివర్స్ అనే నినాదంతో తిరువనంతపురం నుంచి దేశ రాజధాని ఢిల్లీ వరకు ర్యాలీ నిర్వహించబోతున్నారు. ఇది సెప్టెంబర్ 3 నుంచి ప్రారంభమై ఢిల్లీదాకా చేరబోతున్నది. జలవనరుల పరిరక్షణకోసం స్వాతంత్ర్యం నాటి తరహాలో మహోద్యమం తప్పదని జగ్గీ వాసుదేవ్ అంటున్నారు. ఆయన ఏ ప్రయోజనాలకోసం ఈ ర్యాలీ నిర్వహించినా అది అన్ని రాష్ట్రాల్లో కొంతయినా చైతన్యం, అవగాహన తెస్తుందనడంలో అతిశయోక్తి లేదు. ఈ ర్యాలీ పెద్ద నదుల పరివాహక ప్రాంతాల్లో జరుగుతున్నది. నదులకు రెండు వైపులా చెట్లు, మొక్కలు నాటడం ద్వారా నదులను పునరుద్ధరించాలనేది తమ లక్ష్యమని వాసుదేవ్ ప్రకటించారు.

కేంద్రంలోని నరేంద్రమోడీ ప్రభుత్వం ఇప్పటికే గంగా ప్రక్షాళనకు 'నమో గంగా' అనే ప్రాజెక్టును ప్రారంభించింది. గంగా, యమునలను కాలుష్యం నుంచి, కబ్జాల నుంచి కాపాడటమే ఈ ప్రాజెక్టుల ప్రధాన లక్ష్యం. ఈ మేరకు ప్రక్షాళన కొంతవరకు ప్రారంభమైన తరుణంలో కోర్టులు నదులకు జీవనహోదా ఇవ్వడంతో ఇది ఒక మహోద్యమంలా ప్రారంభమైంది. మానవ వికాసానికి సంస్కృతి, నాగరికతలకు, మానవ మనుగడకు జలవనరులే జీవనాడులు.

పూర్వకాలంలో ప్రజలంతా నదుల వెంటే నివసించేవారు. ఆ నీటితోనే జీవనం కొనసాగించేవారు. ఆధునికత పెరిగినకొద్దీ మానవ జీవనాలు కాంక్రీటు అరణ్యాలుగా మారాయి. జలవనరులన్నీ రకరకాల కాలుష్యాలతో, కబ్జాలతో 50 శాతందాకా కుంచించుకుపోయాయి. ఒకనాడు గంగా, యమునల్లో స్నానం చేయడమంటే ఎంతో పవిత్రం. అక్కడ స్నానం చేస్తే పుణ్యం లభిస్తుందనేది అందరి భావన. అప్పట్లో ఆ నీరు కూడా అంత స్వచ్ఛంగా ఉండేది. జన్మ పునీతమవుతుందని అప్పట్లో అనుకునేవారు. కానీ నేడు గంగా, యమునల్లో పవిత్ర స్నానం చేస్తే మానవ శరీరం జబ్బులమయం అవుతున్నది. ఆ పరిసరాలకు వెళితేనే ముక్కుపుటాలు దుర్గంధంతో బద్దలవుతున్నాయి. స్వచ్ఛమైన నీరు అనేది కనిపించడం లేదు. నదులు, ఉపనదులు, చెరువులు, కుంటలు అన్నీ మానవ స్వార్థానికి బలవుతున్నాయి.

జలవనరులను పరిశ్రమలకోసం, వ్యాపారాలకోసం, జంతువధకోసం, చెత్తను వేయడంకోసం, రసాయనాలు వేయడంకోసం డంపింగ్ యార్డులుగా ఉపయోగిస్తున్నాం. ఫలితంగా నదులన్నీ కాలుష్య కాసారాలుగా మారి స్వచ్ఛమైన నీరు అందని పరిస్థితి ఏర్పడింది. భవిష్యత్‌లో నదులను కబళించాలనే ఆలోచన మానకపోతే భూభాగంలో నాలుగో వంతు ఎడారిగా మారే ప్రమాదం ఉందని పర్యావరణవేత్తలు హెచ్చరిస్తున్నారంటే పరిస్థితి ఎంత తీవ్రంగా ఉందో అర్థం చేసుకోవచ్చు. కోర్టులు నదులకు లివింగ్ స్టేటస్‌ని ఇవ్వడాన్ని కొందరు తప్పు పడుతున్నారు. కానీ అలాంటి వాదనలను కోర్టులు, ప్రభుత్వాలు, పాలకులు, మీడియా పట్టించుకోవలసిన అవసరంలేదు. నీటిని కలుషితం చేస్తే శిక్ష తప్పదనే భయం మొదలైతే తప్ప జలవనరుల మనుగడ ప్రశ్నార్థకంగానే మారుతుందనడంలో సందేహం లేదు.

తెలుగు రాష్ట్రాలు కూడా జీవ మనుగడకు కీలకమైన కృష్ణా, గోదావరి నదులకు కూడా లివింగ్ స్టేటస్ ఇస్తే ప్రజలు సంతోషిస్తారు.

– డాక్టర్ గిరీష్‌కుమార్ సంఘీ




# రంగు మారుతోంది!

– ఎ.వి.వి. ప్రసాద్

ఉపరాష్ట్రపతి ఎన్నికల తర్వాత కనిపిస్తున్న మరో స్పష్టమైన మార్పు- దేశంలోని నాలుగు అత్యున్నత పదవులు బిజెపి చేతుల్లోకే రావడం. రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, ప్రధాని, లోక్ సభ స్పీకర్. ఈ నలుగురు బిజెపి నేతలే, ఆరెస్సెస్ నేపథ్యం వున్నవారే. 2014 సాధారణ ఎన్నికల్లో బిజెపి అఖండ విజయం సాధించి మోడీ ప్రధాని అయినా మిగిలిన ఉన్నత పదవుల్లో కాంగ్రెస్ శిబిరాల నుంచి వచ్చినవారే కొనసాగారు. వివిధ రాష్ట్రాలలోని కాంగ్రెస్ గవర్నర్లను తొలగించి స్వపక్షీయులను ఆ సీట్లలో కూర్చోబెట్టిన బిజెపి అధిష్ఠానం రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి ఆ తర్వాత దాదాపు మూడు సంవత్సరాలపాటు భరించి ఇప్పుడు అత్యున్నత స్థానాలలో కూడా అస్మదీయులనే ప్రతిష్ఠించింది. లోక్‌సభలో అత్యధిక మెజారిటీని స్వయంగా సంపాదించి, గడచిన మూడేళ్లలో రాజ్యసభలో కూడా బలాన్ని పెంచుకొని ముందంజ వేసింది. అక్కడితో ఈ అధ్యాయం ముగిసినట్లే. ఇక లోక్‌సభ ఎన్నికలు ఎప్పుడెప్పుడా అని బిజెపి నేతలంతా ఎదురు చూస్తున్నారనిపిస్తుంది...

**కమల దళము విరిసె, కరమును కడతేర్చె**
**పెద్ద సీట్లపైన ఫేసు మార్చె;**
**రాజకీయ పటము రంగు మారుచునుండె**
**విశ్వవినుత నామ! వినురవేమ!!**

ఉపరాష్ట్రపతి ఎన్నిక ఫలితంలో ఒక విషయం స్పష్టంగా అందరికి అర్థమైంది. అది- దేశ రాజకీయ దృశ్యంలో వచ్చిన మార్పు. గత మూడు సంవత్సరాలుగా స్పష్టాస్పష్టంగా ఉన్న దృశ్యం ఇప్పుడు పూర్తి రూపాన్ని సంతరించుకొంటోంది. రకరకాల రంగులన్నీ పోయి, వివిధ వర్ణాలన్నీ కనుమరుగై క్రమంగా ఒకటే కాషాయరంగు దర్శనమిస్తోంది. పంచ రంగుల చక్రాన్ని వేగంగా తిప్పినప్పుడు కూడా ఇదే విధమైన ఏక వర్ణం కనిపిస్తుంది. ఇది అటువంటిది కాకపో వచ్చు. కానీ అటువంటి భ్రమను మాత్రం కలిగిస్తోంది. మెజారిటీ అసెంబ్లీలో విజయ యాత్ర కొనసాగిస్తున్న బిజెపి రాష్ట్రపతి, ఉప రాష్ట్రపతి ఎన్నికలలోనూ ఆ చాకచక్యాన్నే ప్రదర్శించింది. రాజకీయ వ్యూహాలంటే ఎలా ఉంటాయో మిగిలిన పార్టీలకు బోధపరచింది. ఎత్తుగడలలో ఒకప్పుడు కాంగ్రెస్‌దే పైచేయిగా ఉండేది. ఎన్ని అపజయాలను చవిచూసినా... అంతిమ విజయం ఆ పార్టీకే లభించేలా.. అంటే ఎన్నికలలో పరాభవం జరిగినా అధికారం తమ 'చేతి'కే రప్పించుకోవడంలో కాంగ్రెస్ అందె వేసిన చేయి అనిపించుకొంది. ఆ వ్యూహాలనే, ఆ రాజకీయ సూత్రాలనే ఇప్పుడు అక్షరాలా బిజెపి కూడా అనుసరించి చూపిస్తోంది. ఈ విషయంలో కాంగ్రెస్‌కు సమర్థ నాయకత్వలోపం కావచ్చు, వ్యూహ నిపుణుల లోపం కావచ్చు.. చాలా వెనుకబడిపోయింది. ఎంత వెనుకబడిందంటే.. ఇక ఇప్పట్లో ముందుకు రాలేనంతగా దూరం జరిగిపోయింది. అందుకే దేశ రాజకీయ పటం కూడా రంగులు మార్చుకొంటోందనిపిస్తుంది.



తమ ఉప రాష్ట్రపతి అభ్యర్థిగా బిజెపి నాయకత్వంలోని ఎన్‌డిఎ వెంకయ్యనాయుడి పేరు ప్రతిపాదించినప్పుడు నిజానికి ఆయన గెలుపు ఖరారయిపోయింది. యుపిఎ అభ్యర్థిగా కాంగ్రెస్ గోపాలకృష్ణగాంధీ పేరు ప్రకటించినప్పుడు చాలా మంది ఆశ్చర్యాన్ని ప్రకటించారు కూడా. ఓడిపోతామని తెలిసినా ఆ పెద్దాయనను ఎందుకు బరిలోకి లాగడమనే సందేహాన్ని చాలామందే వ్యక్తం చేశారు. చివరికి ఆగస్టు 5న ఫలితం వెలువడేసరికి ఆ అభిప్రాయమే దానిలో ప్రతిఫలించింది. వెంకయ్యకు అనుకూలంగా ఎన్‌డిఎ ఓట్లతోపాటు అదనంగా 14 ఓట్లు పడ్డాయి. అంటే విపక్షాల నుంచి క్రాస్ ఓటింగ్ బాగానే జరిగిందన్నమట. రాష్ట్రపతి ఎన్నికలో ఎటువంటి ఓట్ల చీలిక కనిపించిందో, అదే ఉపరాష్ట్రపతి ఎన్నికలోనూ కనిపించింది. ఎన్‌డిఎలోని అన్ని పక్షాలకు కలిపి ఉభయ సభల్లో 505 మంది సభ్యుల బలం ఉండగా, ముగ్గురు ఓటు వేయలేకపోవడంతో 502 ఓట్లు ఆయనకు రావలసి ఉంది. కానీ చివరికి 516 ఓట్లు వచ్చినట్లుగా వెల్లడయింది. దానినిబట్టి స్పష్టంగా అర్థమవుతున్న విషయం-

ఏ క్షణంలోనైనా లోక్‌సభకు ఎన్నికలు జరిపితే విపక్షాలకు చెందిన చాలా మంది నేతలు, ఎంపీలు ఎన్‌డిఎ వైపు 'జంప్' చేస్తారనే వాస్తవం. రాష్ట్రపతి ఎన్నిక సమయంలో కనిపించిన దృశ్యమే ఉపరాష్ట్రపతి ఎన్నికలోనూ మరింత స్పష్టంగా కనిపించింది. ఇక్కడ గమనించవలసిన విషయం మరొకటి కూడా ఉంది. రాష్ట్రపతి ఎన్నికలో 768 ఎంపి ఓట్లలో రామ్‌నాథ్ కోవింద్‌కు 522 మంది మద్దతు లభించగా, ఉపరాష్ట్రపతి ఎన్నికలో వెంకయ్యకు 516 మంది ఎంపీల మద్దతు లభించింది. కోవింద్‌కు ఆ ఎన్నికలో జెడియు మద్దతు నివ్వడం వల్ల సంఖ్య బాగా పెరిగింది. కానీ ఉపరాష్ట్రపతి ఎన్నికలో జెడియు మనసు మార్చుకొని విపక్ష అభ్యర్థి అయిన గోపాలకృష్ణ గాంధీకి మద్దతునిచ్చింది. అయినా వెంకయ్యకు 516 ఓట్లు వచ్చాయంటే కేంద్ర రాజకీయాలలో మారుతున్న సమీకరణాలు ఎలా ఉన్నాయో స్పష్టమవుతోంది.

ఉపరాష్ట్రపతి ఎన్నికల తర్వాత కనిపిస్తున్న మరో స్పష్టమైన మార్పు- దేశంలోని నాలుగు అత్యున్నత పదవులు బిజెపి చేతుల్లోకే రావడం. రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, ప్రధాని, లోక్‌సభ స్పీకర్. ఈ నలుగురు బిజెపి నేతలే, ఆరెస్సెస్ నేపథ్యం వున్నవారే. 2014 సాధారణ ఎన్నికల్లో బిజెపి అఖండ విజయం సాధించి మోడీ ప్రధాని అయినా మిగిలిన ఉన్నత పదవుల్లో కాంగ్రెస శిబిరాల నుంచి వచ్చినవారే కొనసాగారు. వివిధ రాష్ట్రాలలోని కాంగ్రెస్ గవర్నర్లను తొలగించి స్వపక్షీయులను ఆ సీట్లలో కూర్చోబెట్టిన బిజెపి అధిష్ఠానం రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతిని ఆ తర్వాత దాదాపు మూడు సంవత్సరాలపాటు భరించి ఇప్పుడు అత్యున్నత స్థానాలలో కూడా అస్మదీయులనే ప్రతిష్ఠించింది. లోక్‌సభలో అత్యధిక మెజారిటీని స్వయంగా సంపాదించి, గడచిన మూడేళ్లలో రాజ్యసభలో కూడా బలాన్ని పెంచుకొని ముందంజ వేసింది. అక్కడితో ఈ అధ్యాయం ముగిసినట్లే. ఇక లోక్‌సభ ఎన్నికలు ఎప్పుడెప్పుడా అని బిజెపి నేతలంతా ఎదురుచూస్తున్నారనిపిస్తుంది.

రాష్ట్రపతి, ఉప రాష్ట్రపతి ఎన్నికల తర్వాత బిజెపి అధిష్ఠానానికి మరో విషయం అర్థమైనట్లుగా కూడా ఉంది. తాము పిలుపునిస్తే

విపక్షాలనుండి చాలా మంది నేతలు 'జంప్' చేయడానికి సిద్ధంగా ఉన్నారనేది బిజెపి అగ్రనేతలు విశ్వసిస్తున్నట్లుగా కనిపిస్తోంది. ఇటీవల బీహార్‌లో 'మహా కూటమి' నాయకత్వంలోని ప్రభుత్వం పడిపోయి బిజెపి మద్దతుతో ఏర్పడిన నితీశ్ ప్రభుత్వాన్ని చూస్తే బిజెపి ముందు ముందు ఇంకెన్ని ప్రయోగాలు చేయబోతోందో! అనే సందేహం కూడా కలుగుతుంది. ఏ నరేంద్ర మోడీని వ్యతిరేకించి నితీశ్‌కుమార్ 'మహాకూటమి' ఏర్పాటుకు వ్యూహం రచించారో, అదే మోడీతో చేతులు కలపడానికి సిద్ధమయ్యారు. ఓ ఏడాదిలోగా వచ్చిన 'మార్పు' అది. ఉత్తరప్రదేశ్ నుంచి, బీహార్ నుంచి కూడా నరేంద్ర మోడీకి దానితో అడ్డు తొలగిపోయినట్లే. ఉత్తరాదిలో మెజారిటీ రాష్ట్రాలు ఇప్పటికే 'కమల' దళాలుగా మారిపోయాయి. ఈశాన్యం లోనూ వరుసగా బిజెపి పవనాలే వీస్తున్నాయి. దక్షిణాదిలో అక్కడక్కడ ఉన్న 'ఎదురుగాలి'ని కూడా తమకు అనుకూలంగా మార్చుకోవడం ఒక్కటే ఇక మిగిలిన మోడీ-అమిత్‌ల చాణక్యం. అది కాస్త అనుకూలమైతే రాజకీయ పటంపై ఇప్పుడు కనిపిస్తున్న వర్ణం మరింత 'ముదురు'తుందనే అనిపిస్తుంది.

**********

వివి గిరి తర్వాత మళ్లీ నాలుగు దశాబ్దాలకు ఒక తెలుగు నేత ఉపరాష్ట్రపతి పీఠం అధిష్ఠించడం తెలుగు వారందరికి గర్వకారణమే. హఠాత్తుగా అగ్రస్థానం చేరడంగాక ఎన్నెన్నో మెట్లు, ఎన్నెన్నో ఆరోహణలు, అవరోహణలు తర్వాత అంచెలంచెలుగా ఎదిగిన నేత ఆయన. వెంకయ్య రాజ్యసభలో ఉంటే సభకే నిండుదనం వస్తుందనే అభిప్రాయం కూడా ఎక్కువగా వినిపిస్తూంటుంది. మాటలో గాంభీర్యం, చమత్కారం, విషయ పరిజ్ఞానం, లోతైన అవగాహన... ఇవన్నీ నిండుగా కనిపించే వెంకయ్యనాయుడు బహిరంగ సభలో ప్రసంగించినా, రాజ్యసభలో ప్రసంగించినా తన 'వాగ్ధాటి'ని మాత్రం ఒకేవిధంగా ప్రదర్శిస్తూంటారు. బహుశా అదే ఆయన ట్రేడ్ మార్క్‌లా కనిపిస్తుంది. ఇక రాజ్యసభ ఛైర్మన్‌గా కూడా ఆయనే వ్యవహరిస్తారు గనుక ఆ 'ప్రత్యేకత' కనిపించేట్లుగానే ఆయన కొత్త పదవికి వన్నె తేగలరని చెప్పవచ్చు.

సాధారణ రైతు కుటుంబం నుంచి వచ్చినా, కాలేజి రోజుల నుండి అసాధారణమైన ప్రతిభను ప్రదర్శించిన వెంకయ్యనాయుడు రాజకీయాలలోకి ప్రవేశించిన తొలినాళ్లలో జనతా పార్టీలో ఉన్నా, తర్వాత బిజెపిలో చేరి క్రమంగా ఆ పార్టీకే జాతీయ అధ్యక్షుడయ్యా రంటే దాని వెనుకగల అపారమైన కృషి, దీక్షలను ప్రశంసించ వలసిందే. ఎమ్మెల్యేగా, లోక్‌సభ, రాజ్యసభలో సభ్యునిగా, కేంద్ర మంత్రిగా ఆయన అందించిన సేవలు అధిక శాతం మెప్పునే అందుకొన్నాయి. ముఖ్యంగా 2002-2004 మధ్య బిజెపి జాతీయ అధ్యక్షుడైనప్పటి నుంచి పార్టీ కేంద్ర రాజకీయాలలో ఆయన తిరుగులేని స్థానం సాధించారు. ఒక సమయంలో అద్వానీకి చాలా సన్నిహితుడుగా మెలగిన వెంకయ్య తర్వాత మోడీకి కూడా దగ్గరై 2014 ఎన్నికల్లో పార్టీ సాధించిన ఘన విజయంలో కీలక పాత్ర పోషించారు. ఆయన ఉపరాష్ట్రపతి కావడంవల్ల తెలుగు రాష్ట్రాల నుంచి కేంద్రంలో గట్టిగా మాట్లాడగల నేత కరవయ్యారనే అభిప్రాయం వినిపిస్తున్నా- అది సబబు కాదనే చెప్పాలి. ఒక తెలుగు వ్యక్తి ఉపరాష్ట్రపతి పీఠం అధిష్ఠించడంకంటె కేంద్రమంత్రి పదవి గొప్పది కాదు కదా! కేంద్రంలో తెలుగు మంత్రులు ఎప్పుడూ గణనీయంగానే ఉంటారు. కానీ రాష్ట్రపతి, ఉప రాష్ట్రపతి వంటి అత్యున్నత స్థానాలకు ఎందరు చేరుకోగలుగుతారు? వివి గిరి తర్వాత మళ్లీ ఆ స్థానానికి వెంకయ్య చేరేసరికి నాలుగు దశాబ్దాలు గడిచిపోయాయి.

వెంకయ్య ఆ అత్యున్నత స్థానం అధిష్ఠించడం తెలుగువారికే గాక బిజెపికి కూడా గర్వకారణమే. ఎందుకంటే రాజ్యసభకు నాయకత్వం వహించే నేతకు ఎంత రాజనీతి నైపుణ్యం ఉండాలో అంత వెంకయ్యకు ఉన్నది గనుక. అజాత శత్రువుగా కూడా ఆయనకు చక్కని పేరు ఉంది. 'రాజకీయాలకోసం నా కుటుంబం నుంచి ఒక్క పైస ఖర్చు చేయలేదు, అలాగే రాజకీయాల్లో ఉంటూ కుటుంబం కోసం ఒక్క పైస తీసుకువెళ్లలేదు' అని తన నిజాయితీని ప్రకటించే వెంకయ్య ఉపరాష్ట్రపతిగా, రాజ్యసభ ఛైర్మన్‌గా ఆ రెండు పదవులకు కూడా వన్నె తెస్తారనడంలో ఎలాంటి సందేహం ఉండదు.

అయితే ఈ మొత్తం ఎన్నికల ప్రహసనంలో పూర్తిగా గల్లంతైన పార్టీ కాంగ్రెస్ అని చెప్పక తప్పదు. 2014 ఎన్నికల్లో ప్రతిపక్ష హోదాను సైతం కోల్పోయిన ఆ పార్టీ తర్వాత వరుసగా అనేక రాష్ట్రాలలో అధికారాన్ని కూడా కోల్పోయింది. చివరికి సంకీర్ణ ప్రభుత్వాలనైనా ఏర్పాటు చేయలేకపోయింది. గత మూడేళ్లుగా జరిగిన ఎన్నికల్లో వివిధ రాష్ట్రాలలో బిజెపి హవా ఎంతగా పెరిగిందంటే- ప్రస్తుతం 18 రాష్ట్రాల్లో బిజెపి స్వయంగా, మిత్రపక్షాల మద్దతుతో ప్రభుత్వాలను ఏర్పాటు చేయగా, కాంగ్రెస్ ఐదు రాష్ట్రాలు, ఒక కేంద్రపాలిత ప్రాంతానికే పరిమిత మైంది. దానినిబట్టి చూస్తే వచ్చే రెండేళ్లలో ఎలాంటి పరిణామాలు సంభవించి రాజకీయ చిత్రపటం రంగు ఇంకెంత మారుతుందో అర్థం చేసుకోవచ్చు.

రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి ఎన్నికలతో లోక్‌సభ, రాజ్యసభల్లో బిజెపి బలం ఎంత ఉన్నదో స్పష్టమైంది. అవసరమైతే క్రాస్ ఓటింగ్ ఎలా జరిపించగలదన్నది కూడా ఆ రెండు ఎన్నికలతో స్పష్టంగా తెలిసింది. తనకు బలం లేకపోయినా అధికార బలం పొందాలంటే అనుసరించవలసిన మార్గమేమిటో బీహార్‌లో చూపించింది. ఇంకా కొన్నిరాష్ట్రాలలో ఒక్క ఉదుటున మొత్తం ఎమ్మెల్యేలంతా పార్టీ మార్చి అధికారంలోకి వచ్చిన ఉదాహరణలు కూడా గతంలో చూశాం. ఈ నేపథ్యంలో- బిజెపి ఏం చేయలేదు? అనే ప్రశ్న తలెత్తుతుంది. ఇలా నరుక్కుంటూ వెళ్తే- లోకసభ ఎన్నికలు వచ్చేసరికి అంటే రెండేళ్లలోగా 2019 ఎన్నికల దృశ్యమేమిటో స్పష్టంగా తెలియవస్తుంది.

కాంగ్రెస్ ప్రస్తుతం అధికారంలో ఉన్న పెద్ద రాష్ట్రం కర్ణాటక ఒక్కటే. అక్కడ కూడా అధికారం చేజిక్కించుకొనేందుకు బిజెపి పావులు కదుపుతున్నట్లుగా తాజా పరిణామాలు స్పష్టం చేస్తున్నాయి. ఇప్పటికే కాంగ్రెస్ అగ్రనేత ఎస్ఎం కృష్ణ బిజెపిలోకి వచ్చేశారు. మరికొందరు ముఖ్య నేతలకు బిజెపి గాలం వేస్తున్నట్లు వార్తలు వినిపిస్తున్నాయి. వచ్చే 18 నెలల్లో అసెంబ్లీ ఎన్నికలు జరిగే కర్ణాటక, గుజరాత్, హిమాచల్ ప్రదేశ్, మధ్యప్రదేశ్, ఛత్తీస్‌గఢ్, రాజస్థాన్‌లో ఎక్కడా కాంగ్రెస్‌కు అనుకూల పవనాలు కనిపించడం లేదనే అభిప్రాయమే వినిపిస్తోంది. ఆ రాష్ట్రాలు కూడా బిజెపి చేతిలోకి మళ్లితే దేశ రాజకీయ పటంపై పూర్తిగా ఒక్క వర్ణమే కనిపిస్తుందని పిస్తుంది. కాంగ్రెస్ తన రంగులన్నీ వరుసగా కోల్పోతూ ఒకటే 'శ్వేత' వర్ణంలోకి రావడం, బిజెపి అన్ని రంగులను తనలో ఇముడ్చుకొంటూ రాజకీయపటంపై ఒకటే కాషాయ రంగు కనిపించేట్లు చేయడం చూస్తే దేశ రాజకీయాలలో మార్పులు ఎంత వేగంగా సంభవిస్తున్నాయో స్పష్టమవుతుంది. 1942-47 మధ్య దేశంలో ఎలాంటి మార్పులు సంభవించాయో, అలాంటివి 2017-22 మధ్య కూడా సంభవిస్తాయని ప్రధాని మోడీ అంటున్నారు. ఉపరాష్ట్రపతి ఎన్నికకు ముందురోజు ప్రధాని అన్న ఈ మాటలకు అర్థం ఏమయి ఉంటుందో మరి!

■



# YOUTH భారత్ భవిత..!

కవర్‌స్టోరీ

ఎం.రామ్‌గోపాల్

**ఏ రంగమైనా సరే భవిష్యతరానికి తామే దీపధారులం కాగలమన్న తపన నేటి యువతరంలో అతి స్పష్టంగా కనిపిస్తుంది. అయితే ఒక మార్గం, ఒక దిశ, ఒక నిర్దేశం, కఠోర సాధన, తగిన అన్వేషణ, పట్టుదలతో పయనం, పరిస్థితి ఎదురొడ్డి నిలవటం, సామాజిక స్పృహ, విభిన్న ఆలోచనలు ఎక్కడా రాజీ పడని మనస్తత్వాలు వెరసి కొందరిని మాత్రమే గమ్యం చేరుస్తున్నాయనటంలో సందేహం లేదు. అయితే పెడధోరణులు, సంకుచిత మనస్తత్వాలతో, చులకన భావన, నిర్లక్ష్యం అధఃపాతాళానికి దిగజారిపోతున్న యువతరాన్నీ గమనించొచ్చు. అంతర్జాతీయ యువజనోత్సవాల వేళ ఓ సమగ్ర అవలోకనం ఈవారం మీకోసం..**

భారతావనికి అపూర్వ శక్తి సంపద యువతరం అనటం నిస్సందేహం. దేశ ఉన్నతికి, ఔన్నత్యానికి ప్రతీకగా నిలచే యువశక్తి సాధిస్తున్న విజయాలు వారి వ్యక్తిగతమే కాదు భవిష్యతరాలకు స్ఫూర్తిదాయకం కూడా. వీరికి దశాదిశ నిర్దేశాలను చేయాల్సిన బాధ్యత పెద్దలపై ఉంది. లేకుంటే యువశక్తి దేశానికి ఎంత మేలు చేస్తుందని భావిస్తున్నామో, కాస్త గతి తప్పితే అంతకు మించిన కీడునూ ఎదుర్కొనాల్సి వస్తుందన్నదీ వాస్తవం. ప్రపంచ వ్యాప్త యువతను అనుకూల పథాన నడిపించేలా రెండు దశాబ్దాలుగా ఏటా ఆగష్టు 12న అంతర్జాతీయ యువజనోత్సవాలు జరుపుకుంటూనే ఉన్నాం.

## ప్రారంభం ఇలా...

1995 అంతర్జాతీయ యువత కోసం ప్రత్యేక కార్యాచరణ ప్రారంభించేలా ఐక్యరాజ్యసమితి సిఫార్సులను ఆమోదించిన జనరల్ అసెంబ్లీ, వారి సమస్యల పరిష్కారం దిశగా దృష్టి సారించి, ఏటా ఒక్కో అంశం ఆలంబనగా ప్రత్యేకంగా ఉత్సవాలు నిర్వహిస్తోంది. 1999లో నిర్వహించిన ప్రపంచ యువ మంత్రుల సదస్సు యువతకు స్ఫూర్తినిచ్చేలా యువజన దినోత్సవాన్ని జరపాలని నివేదికలిచ్చింది. దీనిపై ఐరాస జనరల్ అసెంబ్లీ సుదీర్ఘంగా చర్చించి ఆగష్టు 12ను ప్రపంచ యువజన దినోత్సవంగా జరపాలని నిర్ణయించింది. అప్పటి నుంచి గత 18ఏళ్లుగా ప్రపంచయువత సమస్యలపై ప్రభుత్వాలు, ఇతర సంస్థలు దృష్టి కేంద్రీకరించేలా ప్రత్యేక వర్కు షాపులు, అవగాహన సదస్సులు, సాంస్కృతిక కార్యక్రమాలు, సమావేశాల ద్వారా అనేక కార్యక్రమాలను సాగిస్తోంది ఐరాస. 2000లో 'యువత -భావి పౌరులు' అంశాన్ని ప్రాతిపదికగా తీసుకుని యువతకు అవగాహన పెంపొందించడంతో ప్రారంభమైన ఈ అంతర్జాతీయ యువజనోత్సవం కాలక్రమంలో ఎయిడ్స్, నిరుద్యోగం, సుస్థిర భవిష్యత్- అభివృద్ధి కోసం యువత, యువత-ఉత్పాదికత పనులు, అంతర తరాల సమాజంలో యువత, పేదరిక నిర్మూలన, అభివృద్ధిలో యువజన భాగస్వామ్యం, మీరు ఎలా ఉత్సవం జరుపుతారు, విభిన్న సంస్కృతులు, తరాల మధ్య యువత - పరస్పర అవగాహన ఇలా అనేక అంశాలలో యువజనోత్సవాలు సాగాయి. సామాజికపరంగా యువత ఎదిగేలా ఈ యువజనోత్సవాల తీరు ఎప్పటికప్పుడు మార్పులు చేస్తూ ముందుకు వెళ్తుండటం శుభపరిణామమే.



## మన దేశంలో యువక కేంద్రాలు

యువ శక్తికి దశ, దిశ నిర్దేశం చేసేలా కేంద్ర ప్రభుత్వం ఏర్పాటు చేసిన నెహ్రూ యవ కేంద్రాలు ఈ సందర్భంగా యువతలో దేశీయ సమస్యలపై, ఉపాధి అవకాశాలు, జాతీయ సమైక్యత, ప్రభుత్వ పథకాల వినియోగం తదితర అంశాలపై జాగృతం చేస్తాయి. అలాగే యువతని ఆత్మ విశ్వాసాన్ని, శక్తిని ప్రదర్శించేలా ఆటలు, పాటలు, ఉపన్యాస పోటీలు, రక్తదాన శిబిరాలను ఈ వారోత్సవాలలో నిర్వహిస్తారు. అయితే కాలక్రమంలో నెహ్రు యువ కేంద్రాల పాత్ర రానురానూ తీసికట్టుగా మారుతోందన్న విమర్శలున్నాయి. నిధుల లేమి ఇందుకు ప్రధాన కారణంగా కనిపిస్తోంది.

## నిర్వీర్యంగా యువజన సంఘాలు

80వ దశకం వరకు గ్రామీణాభివృద్ధిలో యువతదే పెద్ద భాగస్వామ్యం. గ్రామంలోని యువకులు సంఘాలుగా ఏర్పడి అధివృద్ధికి శ్రీకారం చుట్టేవి. సమాజ సేవలో స్వచ్ఛంద భాగస్వాములుగా అనేక కార్యక్రమాలను చేపట్టేవి. రహదారులు, పారిశుద్ధ్యం, మౌలిక సదుపాయాల సమస్యలు తమ శ్రమశక్తితో పరిష్కారాలు చూపగలిగేవి. అయితే ప్రస్తుతం గ్రామస్థులు,

ప్రభుత్వం సైతం ప్రోత్సాహం ఇవ్వకపోవటంతో తమ కార్యకలాపాలను అర్థంతరంగా నిలిపివేసాయి. దీంతో యువజన సంఘాలు దాదాపు నిర్వీర్యమైపోతున్నాయి. ఇందుకు ప్రధాన కారణం గ్రామాలన్నీ రాజకీయం, కులం చాటున జరిగే వర్గ పోరు సమాజ సేవపై కాక రాజకీయ నేతల ప్రయోజనాలలో పావులైపోతున్నారు యువత.

## యువ చేతన

యువజన సంఘాలను తిరిగి గ్రామాల అభివృద్ధిలో భాగస్వామ్యం చేసేందుకు తెలంగాణ ప్రభుత్వం 'యువ చేతన' కార్యక్రమాన్ని రూపొందించి, ప్రతి గ్రామస్థాయిలో యువజన సంఘాలను ఏర్పాటు చేసి నెలవారీ కార్యక్రమాలు నిర్దేశిస్తూ, పనితీరు ఆధారంగా ఆర్థికంగా సహకారాన్ని అందిస్తుంది. ప్రభుత్వ పథకాలను ప్రజలకు తెలియజేసే గ్రామ పంచాయితీ కార్యదర్శి, మండల అభివృద్ధి అధికారి, కలెక్టర్లు పర్యవేక్షణ అనుసంధానకర్తలుగా యువజనులకు ప్రాధాన్యత ఇస్తారు. జిల్లా కలెక్టర్ అధ్యక్షతన నెహ్రూ యువ కేంద్ర కో ఆర్డినేటర్, జిల్లా యువజన అధికారితో పాటు జాతీయ స్థాయి యువజన అవార్డు గ్రహీతలు సభ్యులుగా ఏర్పడిన జిల్లా కమిటి ఎంపిడిఓలు , గ్రామ కార్యదర్శుల సహకారంతో ఇప్పటికే పనిచేస్తున్న యువజన సంఘాలకు తోడుగా 35 సంవత్సరాల లోపు యువతీ యువకులతో సంఘాల ఏర్పాటుకు ప్రోత్సాహమిస్తారు. సంఘ ఏర్పాటు రిజిస్ట్రేషన్, బ్యాంకు ఖాతా, నెలసరి ఒక్కోసభ్యుడు కనీసం 300 రూపాయలు తక్కువ కాకుండా జమ చేసి వివరాలుఎంపిడిఓకి అందిస్తే స్వయం సహాయక సంఘాల దారిలోనే బ్యాంకుల ద్వారా రూ.5 లక్షల రూపాయల వరకు రుణాలు అందించి స్వయం ఉపాధికి సహకరించడమే యువ చేతన లక్ష్యం. గ్రామ భవిష్య నాయకత్వం తయారు చేయటంతో పాటు గ్రామీణ పారిశుద్ధ్యం, నీటి వినియోగం, క్రీడా శిక్షణ, హరిత హారం, నైపుణ్యత అభివృద్ధి శిక్షణ, యోగా, మరుగుదొడ్ల నిర్మాణం, గ్రామీణ పండగలు, సాంస్కృతిక కార్యక్రమాలు ప్రభుత్వ నిర్దిష్టతలకు అనుగుణంగా నెలవారీగా నిర్వహించాలి.





## యువత పెడధోరణులు

నేటి యువతరంలో అనేక మంది సామాజిక స్పృహ కొరవడి వ్యక్తిగతంగా, సామాజికపరంగా తమ శక్తి కోల్పోతున్నారన్నది నిజం. ఇందుకు ప్రసార మాధ్యమాలతో పాటు, సినిమాలతో పాటు చుట్టూ ఉన్న పరిసరాల ప్రభావం యువతపై తీవ్రంగా కనిపిస్తోంది. తమ ఉత్పత్తులమ్ముకునే కంపెనీల వ్యాపార పెడధోరణులు, పాశ్చాత్య సంగీతం, నేటి తరాన్ని మద్యపానం, ధూమ పానం, మాదక ద్రవ్యాలు లాంటి దురలవాట్లకు బానిసల్ని చేస్తూ సృజనాత్మకతను కోల్పోయేలా చేస్తున్నాయి. అవసరానికి మించి ఉన్న డబ్బులు విచ్చల విడితనాన్ని నేర్పిస్తుంటే, రోడ్లపై వాహనాలు నడుపుతున్న చేస్తున్న విన్యాసాలు చివరికి ప్రమాదాలతో జీవితాన్ని ముగించాల్సిన పరిస్థితి దురదృష్టకర పరిణామం ఓ కోణం కాగా అంతర్జాలంలో, టివి మాధ్యమాలలో చెలరేగుతున్న అశ్లీలత తీవ్ర దుష్ప్రభావాన్ని చూపిస్తూ, అత్యాచారాలు, హత్యల పెడధోరణి పట్టిస్తోంది.

మానసిక రుగ్మతలు కారణంగా దేశ జనాభాలో 5-10 శాతాల మధ్య యువత ఆత్మహత్యలవైపు పయనించగా ఇది తాజాగా 21% మంది ఆ ఆలోచనల దిశగా వెళ్తుండటం ఆందోళనకరమని, బెంగళూరులోని నిమ్స్ హన్ సంస్థ పేర్కొంది. దీనిని మార్చేందుకు వారి శారీరక, మానసిక ఆరోగ్యంపైనా దృష్టి కేంద్రీకరించాల్సి ఉందని తేల్చిచెప్పింది.

## సామాజిక మీడియా ఉద్యమించాలి

నవ సమాజ నిర్మాణంలో సామాజిక మీడియా ప్రముఖ పాత్ర పోషిస్తోంది. ప్రాంతమే దైనా, భాష ఏదైనా యువత తక్షణం సామాజిక మీడియాలో స్పందించ గలుగుతున్నారు. దేశాధ్యక్షుడి మొదలు అభిమాన హీరోల వరకు, ప్రభుత్వ శాఖల నుంచి జిల్లా కలెక్టర్ వరకు సామాజిక మీడియా లో భాగస్వాములవ్వటంతో ప్రజల సమస్యలు త్వరితగతిన తెలుసుకుని సమస్యల పరిష్కారాలు చేస్తున్నారు. ఇందుకు యువత సరికొత్త ఆలోచనలు అమలు దిశగా కృషి జరుపుతున్నారు. ఈ క్రమంలోనే యువతని పెడధోరణల నుంచి బైటకు తీసుకువచ్చే సరికొత్త ఉద్యమాన్ని ప్రారంభించాల్సిన బాధ్యత సామాజిక మీడియాపైనా ఉంది.

## ఉపాధి లేక ఉసూరుమంటున్న యువత

అమెరికా జనాభాకు సరిసమానంగా మనదేశ యువత, దేశీయ జనాభాలో 60% . ఈ అత్యద్భుత మానవ వనరును దేశ ప్రగతిలో భాగస్వామిగా చేస్తే ప్రపంచ దేశాలకు దీటుగా అనేక ఆవిష్కరణలు చేయవచ్చు. అయితే నేటి యువతరానికి ఉన్న అవకాశాలు, అవరోధాలను ఓ సారి అవలోకన చేసుకుంటే .. తగిన ఉపాధి అవకాశాలుండటం లేదన్నది చేదు నిజం. ప్రపంచ యువతలో ఉపాధి దొరకని వారి సంఖ్య 10 కోట్లు కాగా వీరిలో 36% మనదేశ యువతే, అక్షరాస్యుల శాతం వృద్ధి చెందుతున్న క్రమంలో ఆ స్థాయిలో ఉపాధి అవకాశాలు లేక అసంఘటిత రంగంలోనే దొరికిన దానితో సంతృప్తి చెందాల్సి వస్తోందన్నదీ నిజమే. గ్రామీణ వ్యవసాయం లోనూ యాంత్రికీకరణ రాక గ్రామీణ యువతపై ప్రభావం చూపి నిరుద్యోగులను పెంచటం ఆందోళనకర పరిణామమే. 2020 నాటికి ఈ దేశంలో 15-35 మధ్య వయస్కులైన 64% యువత ఉంటుందని ఓ అంచనా, అంటే ప్రతి ముగ్గురిలో ఇద్దరు యువకులే ఉంటారన్నమాట.

# నవ యువకులు..నవ సమాజ నిర్మాతలు!

కొంతమంది యువకులు పుట్టుకతో వృద్ధులు... అంటూ యువతరాన్ని గేలి చేసిన మహాకవి శ్రీశ్రీ 'కొంతమంది యువకులు ముందుతరం దూతలు, పావన నవజీవన బృందావన నిర్మాతలు' అంటూ భారతావని భవిష్యత్తు యువతరానిదేనని ఆహ్వానాలు పలికాడు. వ్యవస్థ భ్రష్టుపట్టిందనుకోవటం యువశక్తి వినాశానికి నాంది. వ్యవస్థలో మనమూ సభ్యులమే, దీనిని మనం మార్చేందుకు ఎందుకు కృషి చేయకూడదన్న ఆలోచనల నుంచి నాకెందుకు, నాకేం ఉపయోగమంటూ చేసే ఆలోచనలే సమాజ అధోగతికి కారణమవుతున్నాయి. కేవలం చదువు, సంపాదనకే పరిమితం కాకుండా సామాజిక రంగంతో పాటు అంతర్జాతీయంగానూ వివిధ రంగాలలో పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న మూడు పదులు కూడా నిండని యువతీయువకులెందరో ఉన్నారు. అందుబాటులోకి వచ్చిన సాంకేతిక పరిజ్ఞానాన్ని తమదైన కోణంలో శక్తియుక్తులను వినియోగిస్తూ, సమాజానికి ఉపయోగపడే అనేక ఆవిష్కరణలు చేస్తున్న యువతరం నేటి తరాలకు ఆదర్శమే. అనితర సాధ్యంగా అబ్బుర పరిచే ప్రతిభతో యావత్ ప్రపంచాన్ని గత కొంతకాలంగా మనం గమనిస్తే..

### దివ్య నిమిశెట్టి



దేశంలోని పెట్టుబడుల రంగంలో మేటి విశ్లేషకురాలిగా 29 ఏళ్ల దివ్య నిమిశెట్టి అంతర్జాతీయ ఖ్యాతి నార్జించింది, ప్రపంచ ప్రఖ్యాతి చెందిన హార్వర్డ్ విశ్వ విద్యాలయంలో ఎంబిఏ చదివిన ఆమె వికింగ్ గ్లోబల్ ఇన్వెస్టర్స్‌లో పనిచేస్తూ అత్యుత్తమ విశ్లేషకురాలిగా ఫోర్బ్స్ పత్రిక నిర్వహించిన మేటి యువత ఎంపికలో స్థానం దక్కించుకుంది.

### సంప్రీతి భట్టాచార్య

ప్రమాద వశాత్తు నీటిలో మునిగి పోయిన విమానాలు, చమురు ట్యాంకర్లను అన్వేషించే 'డ్రోన్ల'పై నిరంతర పరిశోదన, ప్రయోగాలు నిర్వహించి కేవలం ఫుట్‌బాల్ సైజులో ఉండే రోబోకు రూపకల్పన చేసింది సంప్రీతి భట్టాచార్య. మసాచుసెట్స్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో ఏరోస్పేస్ సాంకేతికతపై పిహెచ్‌డి చేసిన 28 ఏళ్ల యువతి కనీసం జిపిఎస్ కూడా పనిచేయని సముద్ర లోపలి భాగంలో పనిచేయగల అండర్ వాటర్ డ్రోన్స్‌తో ప్రపంచంలోనే అత్యంత శక్తిమంతమైన మహిళల్లో ఒకరుగా ఎదిగింది. అండర్ వాటర్ నేవిగేషన్ ఎన్నో ఏళ్ల క్రితమే వాడుకలో ఉన్నా సముద్ర జలాలలో కాలుష్యంతో సహా అతిచిన్న వస్తువులు, సూక్ష్మజీవుల్ని సైతం గుర్తించేలా దానిని పూర్తి స్థాయిలో అభివృద్ధి చేసిన ఘనత సంప్రీతిదే.

### రోహిత్ పోతుకూచి



హైదరాబాద్‌కు చెందిన రోహిత్ పోతుకూచి 2013లో నల్సార్ న్యాయ విశ్వ విద్యాలయం నుంచి న్యాయపట్టా పుచ్చుకుని తన వృత్తిలో కీలక భూమిక పోషించాలని యోచించిన 30 ఏళ్ల యువకుడు. న్యాయవిద్యకు సంబంధించిన విషయాలను ప్రజలకు అందుబాటులోకి తీసుకు వచ్చేందుకు స్టాండర్డ్ ఇండియన్ లీగల్ సైటేషన్ పేరుతో ఓ సంస్థని స్థాపించడంతో పాటు న్యాయస్థానాలకు చెందిన అనేక డాక్యుమెంటేషన్లు, రీసెర్చ్‌లను తయారుచేసాడు. వీటిని గుర్తించిన హార్వర్డ్ లా స్కూల్ తొలిసారి తమ కళాశాలలో పాఠ్యాంశాల బోధనకు వినియోగించింది. ప్రస్తుతం రోహిత్ రాసిన డాక్యుమెంట్లపై దేశ వ్యాప్తంగా 300 పాఠశాలల్లో బోధనకు వినియోగిస్తుండటం విశేషం. అతి చిన్న వయసులో న్యాయవృత్తికి విశేష ప్రాచుర్యం కల్పించడంతో పాటు రచనా గ్రంథాలను అందించిన వ్యక్తిగా ఫోర్బ్స్ పత్రిక వెలువరించిన ప్రభావవంత యువత జాబితాలో చోటు దక్కించుకున్నాడు.

### హృషీకేశ్



బెంగళూరులో నివాసముంటున్న మరో తెలుగు యువకుడు హృషీకేశ్ దాదర్ సాధారణ భారతీయులకు న్యాయవాదులు అందుబాటులో లేకుండా పోతున్నారని గ్రహించి, తక్కువ ఖర్చుతో వాదన చేసేందుకు కొందరు న్యాయవాదులను ఒప్పించడంతో పాటు వకీల్ సెర్చ్.కామ్ పేరుతో 2011లో అందుబాటులోకి తీసుకువచ్చాడు. అంచెలంచెలుగా ఎదిగిన ఈ వ్యవస్థలో ఇప్పుడు వేలాది మంది న్యాయవాదులు తమ పేర్లను నమోదు చేయించుకునేందుకు ఉవ్విళ్లూరుతుండటం విశేషం. సామాన్య ప్రజల కోసం అంతర్జాలం ద్వారా సేవలందిస్తున్న హృషీకేశ్ సేవలను గుర్తించిన ఫోర్బ్స్ తన ఉన్నత యువకుల జాబితాలో స్థానం కల్పించింది.

### కరిష్మా షా



గూగుల్ ఎక్స్‌లో పనిచేస్తున్న కరిష్మా షా కన్స్యూమర్ టెక్నాలజీ కేటగిరిగిలో తన 21 ఏళ్ల వయసులోనే చేరారు. లండన్‌లో జన్మించి పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయంలో చదువుకుని పెన్‌రాస్ అనే భారతీయ నృత్య బృందానికి సారధ్యం వహిస్తునే రాపిడ్ వాల్యుయేషన్ ప్రోగ్రామ్ మేనేజర్‌గా తాత్కాలిక సేవలందించారు గూగుల్‌లో చేరాక 10ఎక్స్ థింకింగ్ టీమ్‌కి రూప కల్పన చేసి ప్రజా జీవితాన్ని తీవ్ర ప్రభావం చూపగలిగేలా సాంకేతిక ప్రమాణాలను మెరుగుపరిచేందుకు చేసిన కృషి ప్రపంచంలో అత్యున్నత టెక్నాలజీ మేనేజ్‌మెంట్ అధిపతిగా తీర్చిదిద్దాయి. లక్ష్యాన్ని నిర్దేశించుకుని ఆ దిశగా యోచన, వివిధ కోణాలలో ప్రయత్నం, నమ్మకం, సాధించాలన్న తపనతో ముందుకు సాగాలి, అందుకు తగిన ప్రణాళికలు రూపొందించుకోవటంతో పాటు ఆత్మవిశ్వాసంతో అడుగులు వేస్తే ఖచ్చితంగా లక్ష్యసాధన చేరగలం అంటారామె. ఈ క్రమంలో తను నృత్యంలో, సాంకేతికత వృద్ధిలో సాధించిన అవార్డులను చూసి మురిసిపోతుందామె.

### రితేష్ అగర్వాల్



ఒయో రూమ్స్ వ్యవస్థాపకులు, సిఇఓగా వ్యవహరిస్తున్న రితేష్ అగర్వాల్ 22 ఏళ్ల వయసులోనే ప్రపంచ వ్యాప్తంగా వంద నగరాలలో ఒయోరూమ్స్ పేరిట 2,200 హోటళ్లను అనుసంధాన పరుస్తూ, టూరిజం ఆతిథ్య రంగాన్ని, వైద్యసేవల విభాగాన్ని అత్యాధునిక సాంకేతికతతో విస్తృత పరచి ఔరా అనిపించుకున్నాడు.

## తొలి ప్రయత్నం విఫలమైనా పట్టుదలతో గెలిచినవారు

తొలిసారే విజయ తీరాలు చేరలేదని నిరాశా నిస్పృహలతో తదుపరి ప్రయత్నాలు వదిలేయటం, మానసిక ఆందోళనతో ఆత్మహత్యలకు పాల్పడటం నేటి తరం యువతలో ఎక్కువగా కనిపిస్తోంది. ప్రపంచ వ్యాప్తంగా పేరెన్నికగన్న వ్యక్తులు కూడా తొలినాళ్లలో పెద్ద వైఫల్యాలను మూటకట్టుకున్న వాళ్లే... తదుపరి చేసిన ప్రయత్నాలే వారిని ఉన్నతశిఖరాల వైపు నడిపించాయనటం నిస్సందేహం. ఇలాంటి వ్యక్తుల్లో కొందరి గురించి టూకీగా పరిశీలిస్తే...

## హెన్రీఫోర్డ్



ప్రపంచ వ్యాప్తంగా పేరెన్నిక గన్న ఫోర్డ్ కార్లకంపెనీ అధినేత, కార్లకంపెనీ స్థాపనలో నిలదొక్కుకునేందుకు చేసిన ప్రయత్నాలు ఒకటి, రెండు కాదు. ఐదు పర్యాయాలు విఫలమైనా ఆరో ప్రయత్నంలో విజయం అందుకున్నాడు.

## సోచీరో హోండా



ప్రపంచంలో బిలియన్ డాలర్ల కంపెనీకి యజమాని. మెకానికల్ ఇంజనీర్‌గా టోయోటా మోటార్ కార్పొరేషన్‌లో ఉద్యోగం కోసం ఇంటర్వ్యూకి వెళ్లి తిరస్కరణకు గురయ్యాడు. ఆ కంపెనీకి దీటుగా ఎదగాలన్న లక్ష్య నిర్ణయంతో ఇంటిలోనే స్కూటర్ మెకానిక్‌గా జీవితాన్ని ప్రారంభించి, ఆపై స్వంతగా స్కూటర్లు తయారుచేస్తూ, పొరుగువారి ప్రోత్సాహంతో వాహన తయారీ, అమ్మకం చేస్తూ, హోండా కంపెనీకి శ్రీకారం చుట్టాడు.

## బిల్‌గేట్స్



భారతావనికి సుపరిచితుడైన బిల్‌గేట్స్ మైక్రోసాఫ్ట్ సహ వ్యవస్థాపకుడు పాల్ అలెన్తో కలిసి ట్రఫో డేటా పేరుతో మెట్టమెదటి వ్యాపారాన్ని ప్రారంభించాడు. ఈ ప్రయత్నం విజయవంతం కాకపోవటంతో మరింత కసిగా చేసిన ప్రయత్నమే నేటి మైక్రోసాఫ్ట్ విశాల ప్రపంచం.

## వాల్ట్ డిస్నీ



డిస్నీ లాండ్ పేరుతో ప్రపంచ చలన చిత్ర పరిశ్రమను తనకు కేరాఫ్ అడ్రస్‌గా మలచుకున్న వ్యక్తి. తొలినాళ్లలో చిన్న వార్తాపత్రికలో పనిచేస్తూ ఎడిటర్‌కి వచ్చిన కోపానికి బలయ్యాడు. ఆపై అనేక వ్యాపారాలు చేసినా అవన్నీ దివాలా, వైఫల్యాలతోనే ముగిసాయి. చివరకి సొంత ఇంటి దగ్గర చిన్న పార్కు రూపొందించి పిల్లల్ని ఆడించేందుకు చిన్న చిన్న మొత్తాలను వసూలు చేయటం ప్రారంభించి, తన ఆలోచనలకు దీటుగా థీమ్ పార్కులను ఏర్పాటు చేస్తూ అంచెలంచెలుగా డిస్నీలాండ్ ఏర్పాటు చేసి ఏటా బిలియన్ల డాలర్లను సంపాదించాడు.

## ఓప్రా విన్ఫ్రే




విశ్వవిఖ్యాతి చెందిన ఓప్రా టివి అధినేత్రి. ఓ పత్రికలో రిపోర్టర్‌గా జీవితాన్ని ప్రారంభించి, అనేక టెలివిజన్లలో ప్రతినిధిగా ఉద్యోగాలు చేసారామె. పనిచేసే ప్రతి చోటా చీత్కారాలు, తిరస్కరణలు, అవమానాలూ ఎదుర్కొని వృత్తిపరంగానూ అనేక ఎదురుదెబ్బలు తిని, ఉద్యోగాలు కోల్పోయిన మహిళ. ఈ క్రమంలో తనే సొంతగా మీడియా సంస్థ నెలకొల్పి అవాంతరాలెదురైనా నిలదొక్కుకుంటూ ఓప్రా టెలివిజన్ ఛానల్‌కి అధినేత్రిగా ఎదిగారు. ప్రస్తుతం ప్రపంచ అత్యంత సంపన్న మహిళల్లో ఆమె ఒకరంటే అతిశయోక్తి కాదేమో.

## చార్లీ చాప్లిన్



నటుడిని కావాలన్న తపనతో హాలీవుడ్ స్టూడియోల వెంబడి తిరిగి పనికిరావంటూ తిరస్కారాలకు గురైన వ్యక్తి. చిన్న చిన్న నాటకాలు వేసుకుంటూ తన ప్రయత్నాలను కొనసాగించి అవకాశాలందుకుని ఎదిగాడు. ఆయన మరణించినా నేటికీ ప్రపంచ వ్యాప్తంగా చాప్లిన్ చిత్రాలకు మార్కెట్ ప్రత్యేకంగా ఉండటం ఆశ్చర్యం కలిగించేదే.

ఇలా ప్రపంచంలో వేలల్లో వైఫల్యాల నుంచి పాఠాలు నేర్చుకుంటూ ఎదిగిన వారెందరో. వీరంతా నేటి యువతరానికి స్ఫూర్తి ప్రదాతలే. ప్రతికూల ఫలితాలను రేపటి విజయాలకు ఆలంబన చేసుకోవాలి. నిబద్ధతతో ముందుకు వెళ్లే వ్యక్తులు ఎదురుదెబ్బలెన్ని ఎదురైనా విజయాన్ని అందుకోవటం ఖాయం.

అయితే నేటి యువతరంలో వైఫల్యాలను సరిదిద్దుకుంటూ ముందుకు సాగలేని తత్వమే నిరాశలకు గురి చేస్తోందన్నది మానసిక నిపుణుల వ్యాఖ్య, నిజమే ఓ విజయం సాధించాలంటే ముందు గత వైఫల్యాలు విశ్లేషించుకోవాలి.



జరిగిన పొరపాట్లను సరిదిద్దుకోవాలి. కానీ ప్రతికూల, విధ్వంసకర ఆలోచనలు క్రమశిక్షణ లేని జీవితం వైపు నడిపిస్తాయి. తన సామర్థ్యాలను తక్కువ అంచనా వేసుకోవటం వల్ల కలిగే మానసిక ఆందోళన అనారోగ్య పరిస్థితికి దారి తీస్తోంది. దీన్నుంచి బయట పడి లక్ష్యాలను సాధించాలంటే తమ సామర్థ్యంపై స్థిరమైన నమ్మకం ఏర్పరచుకోవాలి. ఆత్మవిశ్వాసాన్ని ఎట్టి పరిస్థితులలోనూ కోల్పో కూడదు. నిద్ర, ఆహారం, వ్యాయామాలతో పాటు సంగీతం, సానుకూల స్వీయ చర్చలు, ప్రకృతి ఆహ్లాదక వాతావరణాలకు దగ్గరగా పయనించడం ద్వారా స్థిరమైన ప్రయత్నాలను మరింత పటిష్టం కావించుకుని విజయ తీరాల వైపు సాగేందుకు యువతకు పూర్తి అవకాశాలున్నాయని చెప్తారు అమెరికాకు చెందిన మనస్తత్వ వేత్త కరోల్ డ్వెక్.

భారత్‌ను అవలోకిస్తే నేడు పట్టుదలతో, అకుంఠిత దీక్షతో అడుగులు ముందుకు వేస్తూ, విజయసోపానాలు అధిరోహిస్తున్నవారు ఒకవైపు, లక్ష్యం అంటూ లేకుండా విలాసాలలో, దురలవాట్లలో మునిగిపోయి విలువైన కాలాన్ని వ్యర్థం చేసుకుంటున్నవారు మరికొందరు, చిన్నచిన్న అపజయాలకే కుంగిపోతూ, పరిస్థితులు అనుకూలించడంలేదని వాపోతూ, నిరాశానిస్పృహలకు లోనవుతూ, అది తీవ్రమై డిప్రెషన్‌కు లోనయి ఆత్మన్యూనతతో ఆత్మహత్యలకు తలపడే వారు ఇంకొందరు కనిపిస్తారు. భారత్‌కు ఆయువుపట్టు వంటి యువత ఆశావహ దృక్పథంతో తమంతతాము ఓ చిన్న దీపాన్ని వెలిగించే ప్రయత్నం చేస్తూ, చిరుకాంతులను వెదజల్లుతూ భారత్ భవిష్యత్తుకు నూతనకాంతులను అందించాలి. ■

# కవిత్వాన్ని చుంబించడమంటే...

సాహితీవనం

కవిత్వానికి– 'ఇది మాత్రమే రాయాలి. ఇదే కావ్యవస్తువు' అని, గమ్యాన్ని, మార్గాన్ని, దిశను, నిర్దేశించవలసిన అవసరం లేదేమో! ఏ కవికైనా అతని కవిత్వం, జీవితం, సమాజం, అధ్యయనం, విజ్ఞానం అన్నీ అతని అవగాహన పరిధిలోనే ఉంటాయి.

సామాజిక స్పృహ ఉన్న కవి ఎప్పుడూ ఊహాలోకాల్లో విహరించడు. తాను నివసించే సమాజంలోని సమస్యలు కవిని ఎప్పుడూ వెంటాడుతూనే ఉంటాయి. కులాహంకారం, మతోన్మాదం మన జాతిని పట్టి పీడిస్తున్న జాడ్యాలు. ఆధునిక కవి ఎంత నాగరికుడైనా కూడా, ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కులం దగ్గర మాత్రం తన సంకుచిత భావాలను వదల్లేకపోవడం మిగుల బాధాకరం.

కవికి నిబద్ధతతో పాటు, నిస్పాక్షికత ఉండాలి. సమాజంలో సంఘవిద్రోహ శక్తులకు కొమ్ముకాయకూడదు. అందరికీ సమన్యాయా న్నందించే కవిత్వం సృష్టించాలి. కవిత్వం ఇప్పుడు కవులకు దగ్గరవుతోందేగాని, పాఠకులకు దూరమవుతోందేమో.

కవిత్వం సమాజాన్ని అన్నికోణాల నుంచీ అందరికీ అర్థమయ్యేలా చూపించాలి. ఎవరి దృష్టి కోణాన్ని వారికి నేర్పి, ఎవరి పాత్ర గురించి వాళ్లకు తెలియచెప్పాలి. ప్రజలందరినీ కవనగళంతో మేలుకొలుపుచేయాలి. మారుతున్న సమాజం బట్టి అవసరమైన విధంగా మారాలి. అలా మారలేకపోతే కవులు తమ ధోరణిని సవరించుకోవలసిన అత్యవసరమున్నట్లే. వచనానికీ, కవిత్వానికీ మధ్య సన్నని గీత ఉంటుంది. వచనాన్ని కవిత్వంగా మార్చే పరుసవేది విద్య తెలిసినవాడే సుకవి. ఆ రసవిద్య పట్టుబడడం కవిత్వం ప్రధానలక్షణం. అప్పుడు ప్రతి అక్షరం కవితాపరిమళభరితం అవుతుంది. ప్రతివాక్యం రసప్లావితం అవుతుంది.

కవిత్వానికి రూపం, సారం రెండూ ప్రధానమే. అయినా నేడు సమాజ శ్రేయస్సు, ప్రజాప్రయోజనాన్ని కాంక్షిస్తూ వస్తున్న కవిత్వంలో సారమే ముందు నిలుస్తుంది. కవిత్వానికి దీర్ఘాయుష్షును ఇచ్చేది కూడా సారాంశమే. కాలగమనంలో రూపం మార్పులకు లోనైనా సారం మాత్రం మనిషి, సమాజం, నడవడికల ప్రతిరూపం.

కాసులకోసం కవితలు, పైసాకోసం ప్రచురణలు పరుగులు తీస్తున్న రోజుల్లో – సోషల్ రియాలిటీ, సోషల్ ఫిలాసఫీ మొదలుకుని మేజిక్ రియలిజమ్ వరకు, మార్క్సిస్టు భావజాలం దగ్గర నుంచి మానవ జీవితాలను శాసించే సూత్రాలవరకు అన్నింటినీ తమ కవిత్వంలో ప్రతి భావంతంగా ప్రయోగించి పదుగురి మెప్పుపొందాలని కొందరు కవులు ప్రయత్నిస్తూనే ఉన్నారు. అన్నిట్లోనూ అస్థిరతే. మానవ సంబంధాలు పూర్తిగా విచ్ఛిన్నమయాయి. ప్రతి మనిషికీ తన ప్రపంచమే. ఆ ప్రపంచంలో ఏకాకిగా తాను. ఎక్కడ చూసినా సైబర్ కూలీలు. ఆర్థిక దృష్టే వీరి చలనసూత్రం. విచ్ఛిన్నమవుతున్న సంస్కృతి నుంచి, ఏరకమైన కవితా కళారూపాల్ని ఆశించాలి? అలాటి ఆలోచనే భయం కలిగిస్తోంది.

కవి దుఃఖితుడై ఒక్కొక్క కవితావాక్యంలో తనను తాను దగ్ధం చేసుకోవడమే కాదు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కుదిపివేతకు గురైన తన అంతర్లోకాలను కూడా కవిత్వంలో బలంగా వినిపించాలి. కవిత్వం కడలి అయితే రకరకాల పోరాటాలు, ఉద్యమాలు, వాదాలు లాంటివన్నీ అలలు వంటివి. ఆ అలలు ఎప్పుడూ ఒకదాని తర్వాత మరొటి ఉవ్వెత్తున లేచి, సముద్రం దాటి ఒడ్డుకి దూసుకొచ్చి, మళ్లీ అంతే వేగంతో సముద్రంలోకి వచ్చి తరంగిస్తాయి. కవిత్వం పొడిపొడి అనుభవాలు నిరాశ, నిస్సత్తువల్ని కలిగిస్తుంటే, ఎండి గడ్డకట్టుకు పోయిన విషాద సందర్భాల్లో తడి స్పర్శ కలిగించి జీవితాన్ని చైతన్యవంతం చేస్తుంది.

చిక్కని కవిత్వపు చక్కదనం, క్రమ కవితా శిల్పాలతో ఇందులో కనిపించే గాలి, చెట్టులాంటి ప్రతి ప్రాకృతిక వస్తువు అనుభూతి మధురతను అందిస్తుంది. ఆ వెనుకనే ఒక మంచి సందేశం కూడా ఒక కవితా ఛాయలా ఒదిగి ఉంటుంది. వెల్లువెత్తుతున్న వర్తమాన సామాజిక సంఘర్షణల రాపిడితో కవి మనసులోని ఆలోచనలకు, సరికొత్త సందర్భ దృశ్యాల్ని ఏరుకొని, భావచిత్రాలతో ప్రతిబింబింపచేస్తాడు. ఈ తపన ఆధునిక అభివ్యక్తిలోంచి భావుకతగా ఊపిరి పోసుకోవడం కళాత్మకంగా మారుతోంది. కవితాత్మకంగా అలంకారాలను రూపుకట్టిస్తుంది. ఇందులో సౌందర్యాన్వేషణ కూడా ఉంటుంది.

వర్తమానానికి అన్వయించి కవిత్వం చెప్పడంలో సంప్రదాయక భావజాలం నుండి ఆధునిక సమాజాన్ని వేరుచేసే దృష్టి కవికి కనపడాలి. అప్పుడు ఆ అనుభూతి పరాకాష్ఠ దశకు చేరుకుంటుంది. కవి అనుభవ ఆవేశాలు పరవళ్లు తొక్కి, ద్రవీభూత చలనస్థితిలో ప్రకృతి పరిశీలనలో మునిగితేలేలా చేస్తుంది. ఈ యాంత్రిక జీవితంలోని స్తబ్ధతల్ని బద్దలుకొట్టి, దానితో ఒక అనివార్యమైన ఉపశమన స్థితిని పొందడానికి వైవిధ్యమైన మార్పుల్ని కోరుకోడానికి కవిత్వం సృష్టిస్తాడు. అలాంటి ఉత్తమమైన, ఉన్నతమైన, ఉవ్వెత్తుగా వచ్చే ఆలోచనలకి అక్షర బీజాల్ని నాటి కవితా తోరణాలు కడతాడు.

కవులకు ప్రయోగాలు చెయ్యాలన్న మోజు ఉండటాన్ని కొద్దిగా అర్థంచేసుకోవచ్చు. కానీ ఆ ప్రయోగం పాఠకుడికి అర్థంకావాలి. అప్పుడే ఆ కవితా ప్రయోగానికి సార్థకత అబ్బుతుంది. శుద్ధ వచనం రాసి, ఇదే గొప్ప ప్రయోగాత్మక కవిత్వమంటూ పాఠకులను నమ్మించే ప్రయత్నం చేయకూడదు. పదాల నైసర్గికపు మలుపులను, కాలాను గుణపు మార్పులను, సమకాలీనపు కావ్య భాషను, మనసులో పెట్టుకొని రాసే కవితా మెళకువలు కవికి బాగా తెలియాలి.

మంచి సాహిత్యాన్ని ప్రజలకు అందించాలన్న కోణంలోంచి కూడా ఇప్పుడు తగినంతగా కవిత్వం రావడంలేదు. స్త్రీ, దళిత, మైనారిటీ వాదాల దృక్పథంలోంచి, ఎన్నో కవితా సంకలనాలు వచ్చాయి, వస్తున్నాయి. రాసిన అంశాలమీదే మళ్లీమళ్లీ కవిత్వం రాస్తున్నారు కానీ బడుగు, బలహీన బతుకుల్లో వచ్చిన, వస్తున్న పరిణామాల్ని రికార్డుచేసే కవిత్వం ఇప్పుడు అంతగా రావడంలేదేమో ఒక్కసారి ఆలోచించండి.

**–ఎస్.ఆర్. భల్లం**



# కృతి

## గాయపడ్డ కవి గుండె ఘోస



గాయపడ్డ గుండె భాష' ఎలా వుంటుంది? కర్కశంగా ధ్వనిస్తుంది. అదే కవిత్వమై ప్రవహిస్తే..గిట్టుబాటు ధరలు లేక గిలగిలలాడుతున్న రైతన్నల పక్షం వహిస్తుంది. 'పండిన పంటను/ దళారులు దగాచేసి దండుకుంటే/ వెయ్యరా వెయ్యి..వేటేయ్/ సర్కారు గిట్టుబాటు చేయకుంటే/ దించరా దించు..దించేయ్' అంటూ విప్లవిస్తుంది. దోపిడికి గురవుతున్న దీనుల పక్షాన ప్రశ్నిస్తుంది. 'ప్రశ్నించడమంటే/ సత్యానికి దన్నుగా నిలబడటం/ అన్యాయాన్ని ఎదిరించి పోరాడటం'. సమాజంలోని అసమానతల మధ్య విభజనరేఖల్ని మలిచి పారెయ్యాలనీ..బెబ్బులల్లే ఫిరంగి గుళ్లలా తిరగబడిన అడుగుల జెండాలు పాతాలని ప్రబోధిస్తుంది. కవిత్వమంటేనే బాధ్యతల్నిమోయడం. పరాయి బాధల్ని కలాల్లోకి ఒంపుకోవడం..సమాజపు గోసని తన కవిత్వ ఘోషలో ప్రతిధ్వనించడం. అలా కాని పక్షంలో..'ఓ కవీ! రక్తస్వేదాశ్రువుల సిరాను పారబోసి/ పాలకుల పెంపుడు కుక్కవై మొరిగావంటే జ్ఞాపికల బిస్కెట్లకై బూట్లు నాకావంటే/ నువ్వు కవిగా ఆత్మహత్య చేసుకున్నట్టే'..యిదీ కవి నాగాస్త్ర సందేశం. తన 54 కవితలో చిప్పిల్లిన కవిత్వ వారసత్వం. ఎక్కడిదీ వారసత్వం? 'మా తోలుచెప్పులు/ భీం రాం పాదుకల్లె/ సింహాసనాలనెక్కి/ రాజ్యాన్ని పరిపాలిస్తాయి...అన్న ఆశావహ దృక్పథమే దాని జన్మస్థానం. ప్రశ్నిస్తేనే సమాధానం దొరుకుతుంది. సమస్యలు పరిష్కారమవుతై. అదనే చేస్తున్నాడు కవి తన గాయపడ్డ గుండె భాషతో.

**(గాయపడ్డ గుండె భాష..కవిత్వం:శ్రీనాగాస్త్ర; వెల: రూ.100; ప్రతులకు: శ్రీనాగాస్త్ర, కృష్ణాపురం గ్రామం,టి.నర్సాపురం పో అండ్ మం.ప.గో-534467, ఆం.ప్ర.)**

-రమణ వెలమకన్ని

## స్వావలంబనకు నిలువెత్తు సాక్ష్యం



పూవు పుట్టగానే పరిమళిస్తుందంటారు. దానికి కారణం వంగడం. మనుషుల్లో మాత్రం అలా పరిమళాలు వెదజల్లటానికి కారణం తల్లిదండ్రుల నుంచి సంక్రమించే వంశానుగతం.. స్వయంచోదకశక్తి. 86 సంవత్సరాల పరిపూర్ణత నింపుకున్న నంబూరి పరిపూర్ణగారికి ఈ రెండూ ఒకదానితోఒకటి పోటీపడుతూ బాల్యంలోనే మేధావిని చేశాయి. 'వెలుగు దారులలో..'తన స్వీయచరిత్రను బాల్యంతో మొదలుపెట్టి నాటకరంగం, సినీరంగం, విద్యాభ్యాసం, ఆనాటి ప్రముఖులు దర్శి చెంచయ్యలాంటి మహామహుల సాన్నిహిత్యం, సమాజసేవ తదితర వివరాలిచ్చారు. ఆ తర్వాత ఆనాటి కమ్యూనిస్టు నాయకుడు దాసరి నాగభూషణంతో వివాహం..సంతానం, భర్తతో వచ్చిన పొరపొచ్చాలు, అసౌకర్యాలు, నిజాయితీగా చెప్పుకున్నారు. గత ఏభై ఏళ్లుగా సాహిత్యలోకాన్ని తన కథలు, వ్యాసాలతో మెప్పించిన పరిపూర్ణ స్వీయ చరిత్ర ప్రథమపురుషలో సాగుతూ, పాఠకులను మెప్పించేవిధంగా, ఎవరినీ నొప్పించని విధంగా రాయగలగటం. బహుశా పరిపూర్ణగారికే చెల్లుతుందనుకుంటాను. తొలి ఆరు అధ్యాయాల్లో తన గురించి, ఏడవ అధ్యాయంలో దర్శి చెంచయ్య, శిలాలోలిత, వి.హనుమంతరావు, గబ్బిట కృష్ణమోహన్‌లాంటి ప్రముఖులు వారి దృక్కోణంలో పరిశీలన ఇచ్చారు. ముందుతరం మహిళ అయినా ఈ తరం మహిళలకు కూడా ఆదర్శ ప్రాయంగా నిలిచిన జీవితచరిత్ర పరిపూర్ణగారిది.

**(వెలుగు దారులలో.. నంబూరి పరిపూర్ణ స్వీయచరిత్ర; వెల: రూ.120; ప్రతులకు: అన్ని ప్రధాన పుస్తక కేంద్రాలు)**

-కూర చిదంబరం

## మానవతను మేల్కొలిపే నానీలు



కవి మాయకుంట్ల నారాయణ రెడ్డి తన అనుభవాల సారాన్ని ఈ నానీల వీచికల్లో పొందు పరిచారు. రెండు దశాబ్దాల చరిత్ర ఉన్న ఈ 'నానీ'ల కవితా ప్రక్రియకు అక్షర-పాద-నియతి ఉంది. ఈ పుస్తకంలో రాజకీయ, సామాజిక, కుటుంబ నేపథ్యంలో దాదాపు 198 నానీలున్నాయి. మనిషిలోని మానవత్వ ద్వారాలు తెరుస్తాయి ప్రతి నానీ కవితలో. మచ్చుకు కొన్ని నానీలను పరిశీలిద్దాం.

'అవును/ దుక్కిదున్నటం జూదమే/ గెలిస్తే వరి/ ఓడితే ఉరి;

ఓట్లు వేసేవరకు/ ఊకదంపుడు/ అధికారాన్నిస్తే/ పీక తెంపుడు;

కులమతాలెందుకు/ మనుషుల్లో/ కనిపించవు చివరకు/ ఏ పశువుల్లో..;

'గురి నేర్పని/ గురువులున్నారు/ భద్రం కొడుకో/ నీ బొటనవేలు;

జలతారు చీరకు/ ఉరితాడు కానుక/ మగ్గపు గొయ్యే/ మృత్యువు నుయ్యి;

బలంకోసం/ భూమిని మింగకు/ అరిగించుకోలేవు/ ఆరడుగులు కూడ;

నా నానీలు/ నానా సుగంధ వీచికలు/ అమలిన శృంగార/ గోపికలు

కంచెకావల నక్కలు/ కంచెలోపల/ పందికొక్కులు/ భారతమా!

బహుపరాక్... ఈ నానీలు చదువుతుంటే చాలాకాలం తర్వాత ఓ మంచి నానీల సంపుటి చదివిన తృప్తి కలుగుతుంది.

**(నానీ వీచికలు: మాయకుంట్ల నారాయణ రెడ్డి; వెల: రూ.60; ప్రతులకు: ఎమ్.నారాయణ రెడ్డి, 2-2-647 / ఎ / 27, సాయిబాబానగర్, హైదరాబాద్-500044)**

-తంగిరాల చక్రవర్తి

## ఆధ్యాత్మిక సాధకులకు సోపానమిది!



హిమాలయ యోగుల నిగూఢ రహస్యాలను, క్రియాయోగ మార్గాన్ని, కుండలినీ శక్తి రహస్యాలను, శివాంశ సంభూతులైన బాబాజీ, ఓర్పియోస్, జురాస్టో మెకెకిజ్, అగ్రస్రమహాముని మత్స్యేంద్రనాథ్ వంటి యోగుల విశేషాలు, వారి ఉపదేశ సారం వగైరా ఎన్నో విలువైన అంశాలతో యోగిరాజ్ సద్గురునాథ్ సిద్ధనాథ్ 'స్వేచ్ఛకు రెక్కలు- నాథయోగి యొక్క జీవనయానం' పేరిట ఓ అపురూపమైన పుస్తకాన్ని అందించారు. యోగిరాజ్ అయిదేళ్ల అనవరత కృషి ఫలితమీ పుస్తకం. భగవదవతారాలైన పద్దెనిమిదిమంది దక్షిణ భారతదేశ సిద్ధులు, ఎనభైనాలుగు మంది ఉత్తర భారతదేశానికి చెందిన సిద్ధులు, నవనాథ మహాసిద్ధుల నిగూఢ రహస్యాలను ఈ గ్రంథంలో వివరించారు. మంత్ర సాధన మున శరీరంలోని శుక్రాలలో నిద్రాణమైన కర్మ తాలూకు ప్రారబ్ధ కర్మలు నాశనమైపోతాయని, క్రియా యోగంతో శరీరంలోని వృద్ధాప్యాన్ని నిలుపుదల చేయవచ్చని విశదీకరించారు. క్రియాయోగం శ్వాసను శుద్ధిపరిచి, శరీర క్షతిని నిలుపుదల చేస్తుంది. యోగి చైతన్య పారవశ్యంపై గురిపెట్టి మనసును అంతర్ముఖంచేసి, అనంత చైతన్యంలో లీనమౌతాడని ఒక యోగిగా స్వానుభవంతో ఈ పుస్తక రాజాన్ని మనముందు ఉంచారు యోగిరాజ్ మహాశయులు. ఆధ్యాత్మిక సాధకులకు ఈ పుస్తకం ఒక సోపానం.

**(స్వేచ్ఛకు రెక్కలు-నాథయోగి యొక్క జీవనయానం: యోగిరాజ్ సద్గురునాథ్ సిద్ధనాథ్; తెలుగు అనువాదం: బండేపల్లి నీలాకర్)**

-ఎమ్.రామలక్ష్మి




# అందం..ప్రేమ చందం

కస్తూరి మురళీకృష్ణ

**దేవతలంతా ఆనందంగా చూస్తున్నారు వివాహాన్ని.**

**'అత్యద్భుతమైన ప్రేమ కథ ఇది. వీరిద్దరి వివాహం భావితరాలకు ప్రేమ అంటే ఏమిటో నేర్పిస్తుంది' అన్నారెవరో.**

**'నిజమే. ప్రేమలోనిఎత్తులను అధిరోహించారు. పాతాళ లోతులను చూశారు. అవరోధాలను దాటారు. చివరికి అమృతాన్ని అందుకున్నారు. ప్రేమకథ అంటే ఇది' అనుకున్నారందరూ మనసుల్లో ఆ ముచ్చటయిన జంటను చూస్తూ.**

**దేవతలు, మానవులు అదరూ ఏకగ్రీవంగా అత్యద్భుతమైన ప్రేమగాథగా అంగీకరించిన, ప్రేమగాథ, ప్రేమ దైవం 'క్యూపిడ్', మనస్సుపై నియంత్రణ సాధించిన మనిషి 'సైన్'ల అమర ప్రేమగాథ.**

**********



'నువ్వు సైన్ గర్వం అణచాలి. ఆమె అందం చూసి ప్రజలు నన్ను మరచిపోతున్నారు. ఆమె అందానికి దాసోహం అంటున్నారు. నాకు చేయాల్సిన పూజలు ఆమెకు చేస్తున్నారు. నీ శక్తితో ఆమె దగ్గరకు వెళ్లాలంటేనే ప్రజలు భయపడేట్టు చేయాలి' ఆవేశంతో ఆజ్ఞాపించింది వీనస్.

ఆమెని నిశితంగా పరిశీలిస్తూ అన్నాడు క్యూపిడ్, 'నేను నా బాణాలతో ప్రజలలో ప్రేమ భావనలను జాగృతం చేస్తాను. వారిలోని సౌందర్యోపాసనకు ఉద్దీపకాన్నిచ్చి సున్నిత భావనలకు రెక్కలనిచ్చి, వారిలోని దైవత్వాన్ని జాగృతం చేస్తాను. ద్వేష భావనలను పెంపొందించటం నాకు చేతకాదు' మృదువుగా ధ్వనించింది క్యూపిడ్ స్వరం.

అతడివైపు కోపంగా చూసింది వీనస్.

'ప్రేమ, ద్వేషం ఒకే నాణేనికి రెండువైపులు. నువ్వు ప్రేమ కలిగించు. ద్వేషం అదే జనిస్తుంది. మానవ మనస్తత్వంలోనే మరొకరి ఆనందాన్ని చూసి ఓర్వలేనితనం ఉంది. సైన్ ప్రేమలో పడిన మరుక్షణం ఆమెని ఆరాధిస్తున్న వారందరిలో అసూయ జనిస్తుంది. ఆమెపై ద్వేషం కలిగిస్తుంది.

'కానీ...' అని ఏదో అనబోతున్న క్యూపిడ్ మాటలకు అడ్డువచ్చింది వీనస్.

'అందరూ అర్రులు సాచే అందమైన యువతి, అందరూ అసహ్యించుకునే అందవిహీనమైన వ్యక్తి ప్రేమలో పడిందంటే, మిగతా వారందరిలో అది కోపాన్ని రగిలిస్తుంది. దేశంలో అందగాళ్లే కరవయినట్టు పోయిపోయి అంత కురూపిని వివాహమాడిందని కోపగించుకుంటారు. జాలిపడతారు. అసహ్యించుకుంటారు. నాకు కావాల్సింది అదే. వెళ్లు..సైన్ కురూపి ప్రేమలో పడేట్టు చెయ్యి. నువ్వు వ్యక్తి ప్రేమలో పడేట్టు చేయగలవు కదా, అదే చెయ్యి' ఆజ్ఞాపించింది వీనస్.

క్యూపిడ్‌కు తన శక్తి తెలుసు.

ఎటువంటి వాళ్లనయినా ప్రేమలో పడేయగల శక్తి అతనిది. అలాగని ఇష్టం వచ్చినట్టు ఆటలాగా ఎవరిని పడితే వారిని, ఎవరితో పడితే వారితో ప్రేమలో పడేట్లు చేయటం అతని లక్షణం కాదు.

ప్రతి పనికీ ఈ ప్రపంచంలో కారణం ఉంటుంది. పద్ధతి ఉంటుంది. దాన్ని అనుసరించి పనిచేయటమే తన శక్తికి సార్ధకత అని క్యూపిడ్‌కు తెలుసు.

అందుకే అతను తన శక్తిని, విచక్షణను ఉపయోగించి వినియోగిస్తాడు.

వీనస్ మాటలు అతడిని సంకటంలో పడేశాయి.

అతని బాణం తగిలిన తరువాత కనబడే మొదటి వ్యక్తితో ప్రేమలో పడతారు. కాబట్టి బాణాన్ని భవిష్యత్తు చూసి జాగ్రత్తగా వదలాలి. ఆలోచిస్తూ, సైన్ రాకకోసం ఎదురుచూస్తూ నిలుచున్నాడు క్యూపిడ్.

అంతలో అతని కళ్లముందు విద్యుత్ తటిల్లత మెరిసింది. ఒక్కసారిగా వసంతం వచ్చినట్టు ఆ ప్రాంతమంతా వివిధ సుందరవర్ణపు పుష్పాలతో నిండింది. అతని కళ్లల్లో మెరుపు, పెదవులపై నవ్వు, గుండెలో ప్రేమసాగరాలు, హృదయంలో ప్రేమ తుపాను.

క్యూపిడ్ చేతిలోంచి ధనుస్సు జారింది. కానీ అతడు వదలిన బాణం ఆమెను తాకింది. అయితే బాణం వదిలేముందు అది అతడికీ తాకింది.

దాంతో సైన్‌ను చూస్తూనే క్యూపిడ్ ప్రేమలో పడ్డాడు.

ప్రపంచానికి ప్రేమను పంచి, ప్రేమికుల హృదయాలలో ప్రేమాగ్ని రగిలించే క్యూపిడ్ సైన్‌పై ప్రేమతో రగిలిపోవటం ఆరంభించాడు. బాణం తగిలిన సైన్ తుపాను తాకిడికి చిగురుటాకులా అల్లల్లాడిపోయింది. విరహవేదనతో విలవిలలాడిపోయింది.

అయితే క్యూపిడ్ ఆమె కంటపడలేదు.

అతడికి వీనస్ అంటే భయం. సైన్‌ను వికృత రూపం వాడితో ప్రేమలో పడేయమంది వీనస్. కానీ సైన్ లేకుండా బతకలేడు తాను.

ఆలోచించాడు క్యూపిడ్. తన స్నేహితుడు జెఫైర్ సహాయం కోరాడు.

వెంటనే చల్లనిగాలి వీచింది.

ఆశ్చర్యంగా చూసింది సైన్. హఠాత్తుగా గాలిలో చేరిన చల్లదనం గురించి ఆమె ఆలోచించేలోగా ఆమె గాల్లోకి లేచింది. ఆమె స్పృహ తప్పి పడిపోయింది.

**********

సైన్ కళ్లు తెరిచింది. జరిగింది ఆమెకు జ్ఞాపకం వచ్చింది. దిగ్గున లేచి కూర్చుని చుట్టూ చూసింది.

తాను అద్భుతమైన భవంతిలో ఉంది. ఎటుచూసినా ఐశ్వర్యం ఉట్టిపడుతోంది.

'దాహం' అనిపించింది ఆమెకు.

ఆమె ముందుకు నీటి పాత్ర వచ్చింది.
ఆశ్చర్యంగా దానివైపు చూసింది సైక్. 'ఎవరది? నీరు తెచ్చిందెవరు?' అడిగింది.
'నేనే' గంభీరంగా వినిపించింది స్వరం.
'నేనంటే?' అడిగింది.
'నేనే. నువ్వు ఎవరికోసం విరహానల జ్వాలలో దగ్ధమవుతున్నావో అతడిని. నేను రాత్రిపూట మాత్రమే నీ దగ్గరకు వస్తాను. అప్పుడు కూడా నువ్వు నన్ను చూడాలని ప్రయత్నించవద్దు. నన్ను నమ్ము. నేను నీకు అపకారం చేయను. అన్యాయం చేయను. నేను నీవాడిని. నీ ప్రేమికుడిని. నీ భక్తుడిని'.
ఆమె ఇంకా ఏదో అడగాలనుకుంది. కానీ అడగలేకపోయింది. ఆమెకి ఇదంతా విచిత్రంగా ఉంది. భయంగా ఉంది. నమ్మశక్యంగా లేదు. ఏమిటిది? ఏం జరుగుతోంది? ఆమె మనసులో ఒక అవ్యక్త మూర్తిపై ప్రేమ కలిగిన మాట వాస్తవం. అతడెవరో తెలియకుండా, చూడకుండానే అతడంటే తీవ్రమైన ప్రేమ కలిగింది. అతడికోసం తపించింది. పలవరించింది. ఇప్పుడు అతడే తనని ఇక్కడ చేర్చాడు. కానీ ఇప్పటికీ అతడెవరో తెలియదు. అతడి స్వరూపం తెలియదు. అయినా అతడిని ప్రేమించింది. ఇదెలా సాధ్యం?
అంతలో ఆమెకు తన స్నేహితుల ప్రేమగాథలు గుర్తుకువచ్చాయి.
వాళ్లు ప్రేయసి, ప్రియుడు కలుసుకుంటారు. మాట్లాడుకుంటారు. ఒకరిని ఒకరు మెచ్చుతారు. అలా కలుస్తూ ఉంటే కొన్నాళ్లకి ఒకరిని వదలి మరొకరు ఉండలేమన్న భావన కలుగుతుంది. దాన్ని ప్రేమ అనుకుంటారు. వివాహమాడతారు. వివాహమాడిన తరువాత కానీ ఒకళ్ల అసలు స్వరూపం మరొకరికి తెలియదు.
దానికీ దీనికీ తేడా ఏముంది?
ఆమె ఆలోచిస్తుండగానే చీకటిపడింది.
అతడు వచ్చాడు!

**********

ఆమెకి అంతా తలచుకుంటే ఆశ్చర్యంగా ఉంది.
అతడిని సరిగ్గా చూడకుండానే ఆమె అతడిని సంపూర్ణంగా ప్రేమించటం ప్రారంభించింది.
అతడు కనబడని కాలం స్తంభించిపోతోంది. క్షణాలు యుగాలుగా గడుస్తున్నాయి.
అతడి సమక్షంలో కాలం భావన అదృశ్యమయిపోతోంది. అంతా ఆనందమయం.
కానీ అతడితో క్షణకాలమే గడిపినట్టనిపిస్తోంది. అంతలోనే తెల్లారుతోంది. అతడు వెళ్లిపోతున్నాడు. ఆమె మళ్లీ అతడు ఎప్పుడు వస్తాడోనని ఎదురుచూస్తూ క్షణమొక యుగంగా భారంగా గడుపుతోంది.
అందుకే ఓ రాత్రి ఆమె తన సోదరిలిద్దరినీ కొన్నాళ్లకోసం ఆహ్వానిస్తానంది.
ముందు అతడు ఒప్పుకోలేదు. చివరికి ఒక షరతు విధించాడు.
'ఎట్టి పరిస్థితులలోను వాళ్లు నాగురించి ఏంచెప్పినా నమ్మకూడదు'.
సంతోషంగా అందుకు ఒప్పుకుంది సైక్. తన సోదరిల ప్రభావం తనపై ఉండదనుకుంది. వాళ్లు తన సౌఖ్యం చూసి, ఐశ్వర్యం చూసి అసూయపడటం ఆమెకి తెలుస్తోంది. అందుకే వారి మాటలు పట్టించుకోకూడదని అనుకుంది.
కానీ 'మీ ఆయన ఎలా ఉంటాడో చూడలేదా?' అని వాళ్లు ఆశ్చర్యానికి హేళన మేళవించి అడిగినప్పుడు సైక్ హృదయం చివుక్కుమంది.
'ఏమోనే మీ ఆయన దయ్యమో, భూతమో అయి ఉంటాడు. అందుకే నీ ముందుకు రావటంలేదు. నీమీద మోజు తీరిన తరువాత నిన్ను చంపి తినేస్తాడేమో!' అంది ఓ సోదరి.
'కాదు, మాంత్రికుడయి ఉంటాడు. మోజు తీరిన తరువాత పిల్లినో, ఎలకనో చేసి వదిలేస్తాడు' అంది ఇంకో సోదరి.

వాళ్ల మాటలు విన్నప్పటి నుంచీ సైక్ మనసులో అలజడి మొదలయింది. తనకి అతని రూపం తెలియదు. ఒక నీడతో జీవిస్తున్నట్లే తాను, తన సోదరిలు అన్నట్టు'
ఆలోచిస్తున్న ఆమె మంచంమీది నీడలా పడుకున్న అతనివైపు చూసింది. దీర్ఘ నిద్రలో ఉన్నాడతడు. అతడిని ఒక్కసారి చూస్తే! నిద్రలో ఉన్న అతనికి ఏంతెలుస్తుంది? ఆమె ఆగలేకపోయింది.
దీపం తీసుకుని చడీచప్పుడు కాకుండా మంచం దగ్గరకు వెళ్లింది.
ఎంతో అందంగా ఉన్నాడు! మైమరచిపోయిందామె. తన సోదరిలు అబద్ధం చెప్తారు. అసూయతో తన మనస్సులో లేనిపోని అనుమానాలు కలిగించారు. సంశయం తీరిన ఆమె సంతోషించింది.
అంతలోనే అతడు కళ్లు తెరిచాడు.
'ఏ సంబంధానికయినా పునాది విశ్వాసం. నా మాటను వినలేదు నువ్వు.నన్ను నమ్మలేదు. నేను నీకు చెప్పిన ప్రకారం నిన్ను వదలిపోతున్నాను' అన్నాడు మాయమయ్యాడు.
ఆమె కుప్పకూలిపోయిది.

**********

సైక్ కన్నీళ్లకు వీనస్ కరగలేదు. 'క్యుపిడ్‌ని నేను బంధించాను. అతడిని విడిచిపెట్టాలంటే, పాతాళంలో ఉన్న పెర్సిఫోన్ నుంచి అందంను తీసుకురావాలి. తీసుకురాగలవా?' అడిగింది వీనస్.
'క్యుపిడ్‌తో కలిసి ఉండేందుకు ఏదైనా సాధిస్తాను' నిశ్చయంగా చెప్పింది సైక్.

**********

'అయితే ఇందులో పాతాళంలోని పెర్సిఫోన్‌ను అడిగి కొంచెం అందం తీసుకురా' అంది వీనస్ వంకరగా నవ్వుతూ.

**********

అష్టకష్టాలు పడి పాతాళం చేరుకుంది సైక్. పెర్సిఫోన్ ఎదురుగా. వంకరగా నవ్వింది పెర్సిఫోన్. 'మీ మనుషులు ఏవేవో ఊహిస్తారు. ఏదేదో సాధిస్తామనుకుంటారు. జీవితమంతా దానికోసం వెచ్చిస్తారు. తీరా కోరింది దొరికిన తరువాత అసంతృప్తి చెందుతారు. ఉన్నదానితో సంతృప్తి చెందరు. లేని దానికోసం ఆశపడతారు. ఉన్నది చేజార్చుకుంటారు. లేనిదెలాగో ఉండదు'.
'నాకు అందం కావాలి' పాత్రను పెర్సిఫోన్ ముందుపెట్టింది సైక్.
'ఎట్టి పరిస్థితులలో మూత తెరచి చూడకు' అంది పెర్సిఫోన్.
తల ఊపింది సైక్. కానీ ఆమె మనసులో ఆలోచన వచ్చింది.
'దీన్లో అందం ఉంది. ఇప్పటికే తాను ఎంతో అందమైనదంటారు. వీనస్ కూడా తన అందం చూసి అసూయచెందింది.ఇప్పుడు దీన్లోని అందం కూడా తనకు కూడితే'
ఆమె ఉండలేకపోయింది. మూత తెరిచింది.
'కెవ్వు'న కేకవేసి పడిపోయిది..సైక్ వికృతంగా మారిపోయింది.

**********

ఆమె కోసం ముల్లోకాలు గాలిస్తున్న క్యుపిడ్ వికృతరూపంలో స్పృహ తప్పి పడి ఉన్న సైక్‌ను చేరాడు.
సైక్ వికృతంగా మారగానే వీనస్, క్యుపిడ్‌ను చెరనుంచి వదిలేసింది.
ఆమెకి చికిత్స చేసి స్పృహ తెప్పించాడు క్యుపిడ్.
'నేనిప్పుడు కురూపిని' ఏడవసాగింది సైక్.
'అయినా ఫరవాలేదు. నువ్వు అందగత్తెవి. నాకు నువ్వే కావాలి' అన్నాడు క్యుపిడ్.

**********

వారిద్దరినీ ఆశీర్వదించాడు జూపిటర్.
'క్యుపిడ్, సైక్‌లు స్త్రీపురుషులందరికీ ఆదర్శం కావాలి. ఎంతోమందిలో ప్రేమ భావన కలిగించే క్యుపిడ్ ప్రేమ సైక్‌కు పరిమితం. సైక్ ప్రేమ క్యుపిడ్‌కు అంకితం. అత్యంత ఆదర్శవంతమైన ప్రేమ ఇది' సైక్ అందాన్ని ఆమెకు తిరిగి ఇచ్చి వారిద్దరి వివాహం జరిపించాడు జూపిటర్.



# రంగు ఋతేయం ఓ



పిల్లలూ! పై చిత్రంలో కింద ఇచ్చిన సూచనల ఆధారంగా ఆయా అంకెలున్నచోట ఆయా రంగులు వేయండి.

1.Red 2.Yellow 3.Blue 4.Green 5.Brown 6.Black 7.Orange 8.Purple

# దారి చూపుతారా



# శత్రువైరం

కథ



పూర్వం ఓ పండితుని ఇంట్లో పాడిఆవు ఉండేది. ఒక దొంగ కన్ను ఆ ఆవు మీద పడింది. ఎలాగైనా దానిని దొంగిలించాలని ఓ రాత్రి ఆ యింటికి వెళ్లాడు. అప్పటికే అక్కడ ఒక బ్రహ్మరాక్షసుడు ఉన్నాడు. దొంగ ఆ



రాక్షసునితో 'అయ్యా! నమస్కారం. మీరిక్కడికి ఎందుకు వచ్చినట్లు?' అడిగాడు బ్రహ్మ రాక్షసుడు.

దొంగ, 'ఆవుకోసం' అని, 'నాకు ఆవు, నీకు పండితుడు కావాలి. కాబట్టి మనం గొడవ పడకుండా ఎవరి పని వాళ్లు చేసుకుందాం' అన్నాడు.

'సరేకానీ నేను బ్రాహ్మణుడిని తిని వెళ్లేవరకు నువ్వు ఓపిక పట్టాలి. ముందుగానే నీవు ఆవు దగ్గరకు వెళ్తే అది నిన్ను చూసి అరుస్తుంది. ఆ అరుపులకు అందరూ మేల్కొంటారు. అప్పుడు నా పని కష్టమవుతుంది. కాబట్టి నా పని ముందు జరగాలి. పైగా నీకన్నా నేను బలవంతుడిని కూడా. కాబట్టి నా నాయకత్వాన్ని నీవు అంగీకరించాలి' అన్నాడు రాక్షసుడు.

దొంగ అందుకు ఒప్పుకోలేదు. నీవు పట్టుకోగానే పండితుడు అరుపులు, పెడబొబ్బలు పెడతాడు. ఇరుగు పొరుగు పోగైతే నేను ఒట్టిచేతుల్తో వెళ్లాల్సి ఉంటుంది. నీవు బలవంతుడివి. ఎలాగైనా తినగలుగుతావు. నాయకుడు ముందు అనుచరులకు మేలు కలిగేలా చూడాలి. కాబట్టి నేను ఆవును తోలుకెళ్లేవరకు నీవు ఆగాలి' అన్నాడు.

ఇద్దరూ నేను ముందంటే, నేను ముందు అని వాదులాడుకుంటూ పెద్దగా అరుచుకున్నారు. దాంతో పండితుడికి మెలకువ వచ్చింది. దొంగ వెంటనే తాను దొంగతనానికి వచ్చిన సంగతి కూడా మరిచిపోయి, 'ఓయ్! పండితుడా! ఈ రాక్షసుడు నిన్ను తినడానికి వచ్చాడు' అని అరిచాడు.

రాక్షసుడు కూడా వీడు దొంగ. నీ ఆవుని దొంగిలించడానికి వచ్చాడు' చెప్పేశాడు.

పండితునికి విషయం అర్థమైంది. అందరికీ వినబడేలా ఆంజనేయ దండకం చదవడం ప్రారంభించాడు.

ఆంజనేయుడి పేరు వినగానే బ్రహ్మరాక్షసుడు హడలి పారిపోయాడు. ఇంటిల్లిపాదీ, ఇరుగుపొరుగు వాళ్లు లేవడం చూసి దొంగకూడా కాళ్ళకు బుద్ధి చెప్పి పారిపోయాడు.

**నీతి:** మన శత్రువుల మధ్య వైరం మనకు ఉపకరిస్తుంది.

-ఉలాపు బాలకేశవులు
గిద్దలూరు.







# పిల్లల వార్తాపత్రిక / ఆదివారం

# మంచిని ఎంచుటే మంచి

బాలగీతం



మనిషి మనిషిలోన
మంచి యొకటి దొరుకు
మట్టిలోన దాగె
మణులు ఎన్నో
చేదు చెట్లు గూడ
చేయును మేలెంతో
కంచెకు పనికొచ్చు
కంపచెట్లు
ప్రతిప్రాణి యొకటైన
హితము జేకూర్చును
పనికి రానిది లేదు
పుడమిలోన
ఒగరు పులుపుగూడ
యొనరించు మంచినే
యెందునైన చెడును
ఎంచరాదు
సృష్టిలోని మంచి
సేకరించమేలు
చెడును సేకరించి
ఫలమునేమి?
ఫలదాయకమైన
పనులనే చేయాలి
ప్రగతి బాటలేసి
ప్రఖ్యాతి నీవొందు!

–సామలేటి లింగమూర్తి
సిద్దిపేట.

## హలో ఫ్రెండ్...



చిన్నారుల ప్రశ్నలకు

వార్త సిఎండి, మేనేజింగ్ ఎడిటర్

## గిరీష్ అంకుల్ సమాధానాలు

బి.చంద్రశేఖర్, హైదరాబాద్

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఎనిమిదో తరగతి చదువుతున్నాను. ఐక్యూ అనేది ఎప్పుడు ఎక్కడ ప్రారంభమైంది? దీని అర్థం ఏమిటి? తెలివితేటలకు కొలత ఉంటుందా? దయచేసి వివరించండి.**

**జవాబు:** చంద్రశేఖర్! ఐక్యూ అనే సంక్షిప్త పదానికి అర్థం 'ఇంటెలిజెన్స్ కోషెంట్'. 1890లో అమెరికాలోని ఓ విద్యార్థి తొలిసారిగా తెలివితేటలకు ఒక పరీక్షను రూపొందించాడు. మరోవైపు ఫ్రాన్స్‌లో అల్ఫ్రెడ్ బినెట్ అనే మనస్తత్వ శాస్త్రవేత్త పిల్లల్లో తెలివితేటలను అంచనా వేయడానికి కొన్ని రకాల పరీక్షలు రూపొందించారు. అదే సమయంలో జర్మనీకి చెందిన స్టెర్న్ అనే మనస్తత్వ శాస్త్రవేత్త దీనికి ఒక నిష్పత్తిని సూచించాడు. దీని ప్రకారం చూస్తే ఐక్యూ పరీక్షలో సగటు 100. ఉదాహరణకు మీకు ఐక్యూ పరీక్షలో 100 వచ్చిందనుకుంటే, మీ వయసు ఉన్న వారిలో సగంమంది మీకన్నా బాగా రాస్తారని, మిగిలిన సగంమంది మీకన్నా సరిగా రాయరని అర్థమన్నమాట. మరి 130 వస్తే అంటే మీ వయసు ఉన్నవారిలో 97.5 శాతం మందికి మీకన్నా తక్కువ మార్కులు వస్తాయని అర్థం. ఈ పరీక్షలకు ఐక్యూ పరీక్షలని పేరుపెట్టినవారు అమెరికా దేశానికి చెందిన లూయిస్ టెర్మన్. అయితే తెలివితేటలకు కొలత ఉంటుందా అంటే కొంత వరకు అంచనాకట్టవచ్చు. కానీ ఎంత బాగా పరీక్షలను రూపొందించినా ఒక వ్యక్తి తెలివితేటలను పూర్తిస్థాయిలో అంచనా వేయలేం. ఇంగ్లండ్‌లో మెన్సా అనే సంస్థ 1946లో ఏర్పాటై ఐక్యూ పరీక్షలు నిర్వహిస్తోంది. మనదేశంలో కూడా ముంబయి, పుణే, కోల్‌కతాలలో తరచు పరీక్షలు నిర్వహిస్తుంటుంది. ఈ సంస్థలో 100 దేశాలకు చెందిన లక్షమందికి పైగా సభ్యులున్నారు. 40 దేశాలలో మెన్సా అనుబంధ సంస్థలున్నాయి. ఐక్యూ పరీక్షకు హాజరై గెలుపు సాధించినవారికి ఈ సంస్థలో సభ్యత్వం అందిస్తారు.

జి.అనిత, విజయవాడ.

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఏడో తరగతి చదువుతున్నాను. నాదో సందేహం...పారాచూట్ తెరచిన గొడుగు ఆకారంలోనే ఎందుకుంటుంది? దయచేసి చెప్పండి.**

**జవాబు:** అనితా! పారాచూట్ తెరచిన గొడుగు ఆకారంలోనే ఉండటం వల్ల పరిసర ప్రాంతాలలోని గాలి అందులోనికి ప్రవేశించదు. అతేకాకుండా గురుత్వాకర్షణ శక్తి ప్రభావం పారాచూట్‌ను భూమివైపుగా నెడుతుంది. ఇందువల్ల పారాచూట్ ప్రయాణించే వేగం నెమ్మదిగా తగ్గుతూ, భూమిమీదకు చేరుతుంది.



# కలుపు మొక్క..కలప మొక్కగా!

మొక్కలు పెంచేవారందరికీ కలుపు మొక్కల గురించి తెలిసే ఉంటుంది. ఉపయోగకరమైన మొక్కల మధ్య, కలుపు మొక్కలు పెరిగి, నేలనుంచి సారాన్ని లాగేసుకుంటూ, మంచి మొక్కల ఎదుగుదలను క్షీణింపజేస్తాయి. కలుపు మొక్కల తొలగింపు పెద్ద సమస్యే. పశ్చిమ కనుమల్లో, అక్కడి సిరువని, కోయంబత్తూర్ ప్రాంతాలలో లాంటాన కమర అనే కలుపు విపరీతంగా పెరిగి, అక్కడి మంచి మొక్కల పెరుగుదలకు అడ్డంకిగా తయారైంది. ఈ విషయాన్ని మాయా మహాజన్ తన పరిశోధనలో భాగంగా గుర్తించింది. లాంటానను తొలగించడానికి రసాయనిక మందులు వాడితే వాటి ప్రభావం మంచి మొక్కలపై కూడా పడుతుంది. పోనీ శ్రామికులే వాటిని తొలగించాలనుకుంటే అందుకయ్యే ఖర్చు చాలా ఎక్కువ. ఈ సమస్య పరిష్కారానికి మాయా చాలా ఏళ్లు తీవ్రంగా ఆలోచించింది. అదే సమయంలో లాంటానతో గిరిజనులకు ఏదైనా ఉపయోగం కూడా ఉండాలన్నది ఆమె ఆలోచన. లాంటాన చూడటానికి వెదురులాగే ఉంటుంది. అయితే లాంటాన, వెదురుకన్నా మన్నికైంది. ఈ కోణంలో ఆలోచించగానే మాయా మెదడులో మెరుపు మెరిసింది. లాంటానతో ఫర్నిచర్ తయారుచేస్తే... అన్న ఊహకలిగింది. ఆమె ఆలోచనకు సరైన మద్దతు లభించలేదు. ఆర్థిక సహాయమూ అందలేదు.



లాంటాన ఫర్నిచర్

అంతలో ఆమె కోయంబత్తూరులోని అమృత యూనివర్సిటీలో నెలకొన్న 'సెంటర్ ఫర్ సస్టైనబుల్ ఫర్నిచర్'లో అసోసియేట్ ప్రొఫెసర్‌గా చేరింది. దాంతో ఆమె లాంటాన కలపతో ఫర్నిచర్ తయారీ గురించి, తద్వారా గిరిజనులకు ఆదాయ వనరు కల్పించడం గురించి రిపోర్టు తయారుచేసింది. నిధులందించే ఏజెన్సీ వద్ద నుంచి అనుమతికి నాలుగేళ్లు పట్టింది. కానీ చివరకు ఆమె లక్ష్యం సిద్ధించి నిధులు సమకూరాయి. మాయా ఆలోచన 2015లో ఆకృతి దాల్చింది.



టీమ్‌తో మాయా

అయితే మొదటగా ఆమెకు లాంటాన సేకరణే ఓ సవాలుగా నిలిచింది. గిరిజనులు అడవుల్లోకి వెళ్లి లాంటాన సేకరించాలంటే ఆ అడవులన్నీ ఏనుగులు బీభత్సంగా తిరిగే ప్రాంతాలు. అయితే వి. వెల్లచి అనే వ్యక్తి లాంటాన సేకరణకు ముందుకు వచ్చాడు. అలాగే మరో ఏడుగురు మహిళలు కూడా స్వచ్ఛందంగా ముందుకువచ్చారు.

ఆ తర్వాత లాంటానను కొట్టి, గిరిజనులు వాటిని సేకరించుకోవడానికి అటవీ శాఖనుంచి అనుమతి పొందాల్సివచ్చింది. ఎలాగైతేనేం అటవీశాఖ సైతం లాంటాన కలుపు తొలగించడం కష్టమైన పని అని గుర్తించి వారికి అనుమతి ఇచ్చింది.

బెంగళూరులోని 'అత్రీ' సంస్థ ద్వారా గిరిజనులకు ఫర్నిచర్ తయారీలో శిక్షణ ఇప్పించాలని నిర్ణయించారు. మూడు గ్రామాలకు చెందిన 40మంది మూడు నెలలపాటు ఫర్నిచర్ తయారీలో శిక్షణ పొందారు. సైన్స్ అండ్ టెక్నాలజీ శాఖవారు ఈ ప్రోగ్రామ్‌కు నిధులందించారు.

గిరిజనులు లాంటానతో తక్కువ ఖర్చుతో ఫర్నిచర్ తయారీకి శ్రీకారం చుట్టారు. హస్తకళా సామాగ్రి, బొమ్మలు, మరికొన్ని వాడుక వస్తువులు తయారుచేయటం మొదలుపెట్టారు. ఆరకరంగా గిరిజనులకు ఉపాధి, అటవీ సంరక్షణ సాధ్యమయ్యాయి.

మామూలు ఫర్నిచర్ తయారీకన్నా లాంటానతో ఫర్నిచర్ తయారీ భిన్నమైంది. లాంటాన గుబుర్లను కొట్టివేసిన తర్వాత దాని కలపను వేడినీటిలో ఉంచుతారు. దాంతో లాంటాన వస్తుతయారీకి అనువుగా తయారవుతుంది. దానిపై బెరడును తొలగించి, దుంగను చిన్న కర్రలుగా కోస్తారు. ఆ కర్ర ముక్కలతో ఫర్నిచర్ తయారు చేస్తారు. చూడటానికి మాత్రం ఇవి అచ్చు వెదురు ఫర్నిచర్ మాదిరే ఉంటాయి. పైగా ధర తక్కువ, మన్నిక ఎక్కువ. అంతేకాదు, దీనివల్ల వెదురు, కేన్ చెట్లను ఫర్నిచర్ తయారీ కోసం విరివిగా కొట్టేయడం కూడా తగ్గుతుంది. సింగంపాతి, సర్కార్ పోరతి, కాల్కోటిపతిలలోని 70మంది గిరిజనులకు గత సంవత్సరం లాంటాన ఫర్నిచర్ తయారీలో శిక్షణ ఏర్పాటుచేశారు. మరికొన్ని గ్రామాల వారికి కూడా మున్ముందు శిక్షణ ఇవ్వాలన్నది ఆలోచన. మార్కెటింగ్ విషయంలో కూడా వారికి సహాయసహకారాలు అందించటం జరుగుతోంది. ట్రైబల్ మార్కెటింగ్ కో ఆపరేటివ్ డెవలప్‌మెంట్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా సహకారంతో ఇండియాలోని అన్ని ప్రధాన నగరాలకు లాంటనా ఫర్నిచర్‌ను మార్కెట్ చేస్తున్నారు. ఇప్పటికి ఇది ఆరంభదశలోనే ఉన్నా గిరిజనులు ఇప్పటివరకు 1,70,000 రూపాయల విలువైన ఫర్నిచర్‌ను విక్రయించారు. ఇంకా కొన్ని వేల విలువైన ఆర్డర్లు పెండింగ్‌లో ఉన్నాయి.



'మొదట్లో లాంటనాతో ఫర్నిచర్ అన్న ఆలోచననే చెవికెక్కించుకోనిస్థితి.ఇప్పుడు ఉత్పత్తులు మార్కెట్‌లో ప్రత్యక్షం కావటంతో ఇప్పుడు అడ్వాన్స్ ఆర్డర్లు. ఆర్డర్లకు తగ్గట్టుగా వస్తూత్పత్తి, సమయానికి అందజేత ఎలా అన్నది ఇప్పటి పరిస్థితి' నవ్వుతూ చెపుతారు మాయా మహాజన్.

గిరిజనులకు సేద్యంలోనూ మాయా తగిన సూచనలిస్తోంది. ఏనుగులను ఆకర్షించని పంటలను వేయడం, రసాయనిక ఎరువులకు బదులుగా సేంద్రీయ ఎరువులను వాడటం వంటి విషయాలను వివరించి, వారిని చైతన్యవంతులను చేస్తోందామె. కలుపు మొక్క కలపతో ఫర్నిచర్ తయారీ ఆలోచన నిజంగా ఎంత గొప్పగా ఉంది.. వ్యర్థాన్ని, అర్థవంతం చేసిన మాయా అభినందనీయురాలు!

# జనగణ మంగళ దాయక జయహే!



ఆగస్టు 15 భారత స్వాతంత్ర్య దినోత్సవం

భారతీయులందరికీ ఆగస్టు పదిహేను పండగరోజు. ఎందుకంటే అది మనకు స్వాతంత్ర్యం సిద్ధించిన రోజు. స్వాతంత్ర్యం కన్నా పెద్ద పండగ ఏముంటుంది? మనదేశానికి 1947లో స్వాతంత్ర్యం వచ్చింది. వందల ఏండ్ల బ్రిటిష్ పరిపాలనకు తెరపడి పాలన మన హస్తగతమైంది. నాడు ఢిల్లీలోని పార్లమెంటు భవనం హాలులో భారతదేశానికి స్వాతంత్ర్యం ఇస్తున్నట్లు లార్డ్ మౌంట్ బాటన్ ప్రకటన చదివారు. భారతదేశానికి గవర్నర్ జనరల్‌గా లార్డ్ మౌంట్ బాటన్ గారినే ఉండమని కాంగ్రెస్ నాయకులు కోరారు. స్వాతంత్ర్యం వచ్చాక జవహర్ లాల్ నెహ్రూ ఆగస్టు 14 అర్ధరాత్రి.. తెల్లవారితే పదిహేనవ తేదీ.. జాతినుద్దేశించి తొలి ఉపన్యాసం ఇచ్చారు. కానీ సాంకేతికంగా ఆయన ప్రధానమంత్రి పదవిని అధిష్టించింది ఆగస్టు 15న.



"సకల ప్రపంచం నిద్రిస్తూ ఉన్న సమయంలో భారతదేశం నవజీవనం కోసమై మేల్కొంటూ ఉన్నది" అన్నారు నెహ్రూ. అంతే కాదు.."స్వతంత్ర భారత సాధనతో ఒక పొదరింటిని కట్టుకున్నాం. అయితే అందులో సుఖవంతమైన జీవితానికి కావల్సినవి ఇంకా పూర్తిగా అందుబాటులోకి రాలేదన్న మాట నిజం. మన పిల్లల కోసం ఒక గొప్ప అందమైన భారతాన్ని నిర్మించాలి" అని నెహ్రూ కర్తవ్యాన్ని వివరించారు.

కానీ దేశ విభజనకు ఖిన్నులైన మన జాతిపిత మహాత్మా గాంధీ స్వాతంత్ర్యం వచ్చినవేళ ఆ వేడుకలలో పాల్గొనలేకపోయారు. అన్ని ఉత్సవాలకు దూరంగా ఉన్నారు. ఆరోజు ఆయన ఉపవాసం చేసి తకిలీపై నూలు తీశారు. నెహ్రూ నాయకత్వాన భారతప్రభుత్వం లౌకిక విధానంతో దేశ సమైక్యతకు, ప్రణాళికాబద్ధమైన కృషితో దేశాభివృద్ధికీ కంకణం కట్టుకుంది.

మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చి అరవై ఏడు ఏళ్లు పూర్తయ్యాయి. అరవై ఎనిమిదవ ఏట అడుగిడబోతున్నాం. అశేష ప్రజానీకం పాల్గొన్న పోరాటాల వల్ల, అనేకానేకులు చేసిన త్యాగాల వల్ల సామాన్య జనం చేసిన నిరుపమాన రక్తతర్పణం వల్ల నేడు మనం స్వాతంత్ర్య ఫలాలను అనుభవిస్తున్నాం. స్వాతంత్ర్యపోరాటంలో అసువులు బాసి అమరులైన వారు..భావితరాలు సమానత్వం, స్వావలంబనతో తులతూగాలని ఆశించారు. ఆ వీరుల ఆశయాలను నెరవేర్చాల్సిన బాధ్యత నేటితరంపై ఉంది.

నాడు వారన్ని త్యాగాలు చేసి స్వతంత్ర భారతాన్ని మనకు అందిస్తే, నేటి తరం మనిషి ఆశాజీవిగా కాకుండా అత్యాశ జీవిగా, సంతృప్తి లేకుండా కష్టే ఫలీ అనకుండా నాలుగు డబ్బులు వేనకేసుకోవడమే జీవనవిధానమని భ్రమించడం విచారకరం. సంతృప్తి గలవారే సంపన్నులన్న మాటను విస్మరిస్తున్నారు. ఆధునిక యుగం మనకు ప్రసాదించిన మానసిక వ్యాధుల్లో 'అసంతృప్తి' ఒకటి. ఒక ఆధునిక మేధావి తన చదువుకు తగిన జీతం మనదేశంలో లభించడం లేదని పర దేశాన్ని ప్రస్తుతిస్తూ అక్కడకు వలసవెళ్లాడు. అక్కడ పట్టపగలే పదిమంది సాయుధులై వచ్చి ఇళ్లల్లో జొరబడుతున్నారు. అడిగే నాథుడే లేడు. ఎదురు తిరిగి అదేమని అడిగితే అంతమై పోవాల్సిందే. ఆ మేధావికి స్వదేశం ఘనత అప్పుడు తెలిసివచ్చింది. 'నా మాతృదేశంలో ప్రతి విషయంపై అసంతృప్తి ప్రకటించాను. ఇప్పుడు తెలిసొచ్చింది నా దేశం స్వర్గం, లక్షలమంది రోడ్లపక్కనే కూడా నిశ్చింతగా నిద్రపోతూ ఉంటారు. ఏ ఆలయం వద్దకు వెళ్లినా ఇంత ప్రసాదం లభిస్తుంది. అలాంటి స్వర్గంలో సంతృప్తితో జీవించకుండా, కంటిమీద కునుకు లేకుండా చేసే నరహంతక ముఠాలు తిరిగే ఈ నరకంలోకి వచ్చిపడ్డాను. హే భగవాన్! నాకు హెచ్చు జీతం వద్దు, ప్రాణంతో నా దేశానికి చేర్చు' అనుకున్నాడు.

అసంతృప్తి మనిషిని మానసికంగానే కాదు, శారీరకంగానూ కుంగదీస్తుంది. 'ఆరడుగుల నేల' అనే ప్రసిద్ధ రష్యన్ కథలో ఒక వ్యక్తి తాను ఎంతదూరం పరుగెత్తితే అంత భూమి సొంతం అవుతుందనే ఆశతో, పరుగెత్తి, పరుగెత్తి ప్రాణాలు పోగొట్టుకుంటాడు. అందుకే మనవాళ్లు దురాశ దుఃఖానికి చేటని ఏనాడో చెప్పారు.

నిస్వార్థంగా చేతనైనంతలో మనకు వీలుపడినంత సమాజానికి మంచి చేయాలనే ఆలోచన ఎందుకు రాదు? 'ఈదేశం ఎప్పుడు బాగుండాలండీ? మనమొక్కరం మంచిగా ఉంటే అంతా బాగవుతుందా?' అని కుతర్కం చేయకుండా కనీసం దేశాన్ని బాగుచేయకపోయినా, ఎవరికి వారు మేలైనదారిలో నడవలేరా? ఈ కోణంలో ఆలోచించాలి.

ఇక స్వాతంత్ర్యదినోత్సవాన మొక్కుబడిగా కాకుండా త్రికరణ శుద్ధితో త్రివర్ణ జాతీయపతాకను ఎగురవేయాలి. ఆరోజున ప్రభుత్వ, ప్రయివేటు కార్యాలయాలు, పాఠశాలలు, కళాశాలలు..ఒకచోటనేమిటి, వీధివీధిలో జాతీయ పతాకం ఆవిష్కృతమవుతుంది. పతాకవందనం అనంతరం, జాతిపితను, ఇతర నాయకులను స్మరించుకొని, దేశ స్థితిగతులను సమీక్షించుకొని, కర్తవ్యాన్ని గుర్తుచేసుకొని పరస్పరం మిఠాయిలు పంచుకోవటం, ఒకరికొకరు అభినందనలు తెలియ జేసుకోవటం తెలిసిందే.

ఈ సందర్భంలో మనం ఒక విషయం గుర్తుంచుకోవాలి. మనం మన అమ్మను ఎలా, ఎంతగా ప్రేమిస్తామో, మన దేశాన్ని అదేవిధంగా ప్రేమించాలి. దేశం మనకేమిచ్చింది అని కాకుండా దేశానికి మనమేం చేస్తున్నాం అని ప్రశ్నించుకుని, సత్పౌరులుగా మెలగుతూ ప్రగతిబాటలో ముందుకు సాగాలి. అప్పుడే 'జనగణ మంగళ దాయక జయహే!' అక్షర సత్యమయ్యేది.

–ద్యాప విజయ్‌కుమార్



# అమావాస్యకు వెన్నెలొచ్చింది!

**అంగరంగ వైభవంగా జరుగుతోంది పెళ్లి. పెళ్లికొడుకు సత్యనారాయణ ఆర్డీవో. పెళ్లికూతురు డిప్యూటీ తహసిల్దార్. కొత్త పెళ్లిజంటను ఆశీర్వదించడానికి ఆ జిల్లామంత్రి, ఎమ్మెల్యేలు, ఆ జిల్లా కలెక్టర్ వచ్చారు. పెళ్లితంతు ముగియగానే ముందుగా ఆ జంట పీటల మీదనుండి లేచి ఆ పెళ్లికూతురు అమ్మా-నాన్నల దగ్గరికి వెళ్లి ఆ వేదిక మీదే సాష్టాంగ నమస్కారం చేశారు. ఆ వేదిక మీద ఆసీనులైనవాళ్లు ఆ దృశ్యాన్ని చూసి ఆశ్చర్యానికి లోనయ్యారు. సాధారణంగా కాళ్లు కడిగినవాళ్లు ఆ జంటకు వంగి నమస్కరించడం సంప్రదాయం. కానీ, ఇక్కడ 'అల్లునితో అత్తామామలు మొక్కించుకోవడమేంటి' అని ఆ ఫంక్షన్ హాల్‌లో గుసగుసలు మొదలయ్యాయి. కానీ, అలా ఆశీర్వాదం వారి నుండి తీసుకోవడం తన బాధ్యత అని ఆ పెళ్లికొడుకైన ఆర్డీవోకు తెలుసు.**

– అల్లాడి శ్రీనివాస్

కడు పేదరికం... భార్య పురిటిలోనే కన్ను మూసి, పసికందును అప్పజెప్పింది. నర్సింలు కష్టాలు వర్ణనాతీతం. ఊరిబయట పాఠశాల వెనక ప్రభుత్వ భూమిలో తాటిక మ్మలతో ఒక చిన్న గుడిసె వేసుకుని జీవనం సాగిస్తున్నాడు. కొడుకు నడక నేర్చేవరకు దగ్గర్లోని ఇళ్లల్లో బీడీలు చుట్టేవాళ్ల దగ్గర ఆ అబ్బాయిని ఉంచి కూలిపనికి వెళ్లేవాడు. నర్సింలు తండ్రి పేరని కొడుకును 'నారిగా' అని పిలిచేవాడు. నారిగానికి ఐదేళ్ల వయస్సు రాగానే తనతోపాటు కూలిపని చేసే చోటుకు తీసుకెళ్లేవాడు. నర్సింలు ఇంటి నిర్మాణ పనులకు వెళ్తే ఈ నారిగాడు తండ్రితోపాటు ఒక్కో ఇటుకను మోసేవాడు. తండ్రి కళ్లంలోకి వరి కట్టలు మోస్తూ, కుప్పలో వేస్తే వీడు చేతనైనన్ని వరిగొలకలు తీసుకొచ్చి ఆ కుప్పలో వేసేవాడు. పగలు ఆ పొలాల ఒడ్డుకు చెట్టుకింద గుడ్డలో కట్టుకొచ్చిన అన్నం, ఆవకాయ కలిపి పెడితే తండ్రితోపాటు తినేవాడు.

ఎనిమిది సంవత్సరాల వయస్సులోనే నారిగాడు స్వంతంగా కూలిపనులకు వెళ్లడం ప్రారంభించాడు. ఒక్కోసారి చేతులు బొబ్బలెక్కేవి. చర్మం అంతా కందిపోయేది. అయినా పట్టుదలతో పెద్దవాళ్లతో సమానంగా పనిచేసి, కూలిపని ఇచ్చినవాళ్ల మెప్పు పొందేవాడు. తండ్రిని పొయ్యి దగ్గరకు రానీయకుండా, వంటపని కూడా చేసేవాడు. పొద్దున 5.30 గం॥లకే నారిగాని దినచర్య ప్రారంభం. దగ్గర్లోని చెరువుకెళ్లి కాలకృత్యాలు తీర్చుకొని, వచ్చేటపుడు వేపపుల్ల వేసుకొని పండ్లు తోముకుంటూ వచ్చేవాడు. గుడిసె దగ్గర్నుండి బకెట్ తీసుకెళ్లి, ఊరిబయట ఎడ్లు, బర్రెలు నీళ్లు తాగడానికి కట్టిన తొట్టి దగ్గరి బోరింగు నీళ్లతో మొహం కడుక్కొని, స్నానం చేసి వెళ్లడం నారిగాడు రోజూ చేసే పని. వెళ్లిన తర్వాత రేషన్ బియ్యం రెండు గ్లాసులు కడిగి, పొయ్యిమీద పెట్టేవాడు. తండ్రి ఊళ్లోకెళ్లి ఎవరైనా ఇచ్చిన కూరనో, కూరగాయలో, నారిగానికోసం అంగి, నిక్కర్లతో వంట అయ్యేలోపు వచ్చేవాడు. వంట అయ్యాక నారిగాడే రెండు చిన్న పంచెల కొసలకు అన్నం, ఆవకాయ కట్టి ముడేసేవాడు. వారంలో ఎప్పుడో ఒకరోజు వాళ్లు కూర వండుకొని తీసుకెళ్లే వారు. ఎవరింట్లోనైనా ఏదైనా ఫంక్షన్ జరిగితే, అక్కడ మిగిలింది పంపిన రోజే వాళ్లకు మాంసాహారం. అంతటి పేదరికంలోనైనా నారిగాడు ఏ రోజూ బాధతో కన్పించేవాడు కాదు. తండ్రిని కూడా బాధపెట్టేవాడు కాదు. ఏ రోజైనా కూలిపని దొరకకపోతే ఏనుగుల గుట్టకు పోయి, పొయ్యిలోకి వాడుకొనే కట్టెలు మోపు కట్టుకొని వచ్చేవాడు.

ఇంకా ఖాళీ ఉంటే, అదే గుట్టకు పోయి మోతుకు ఆకులు తెచ్చి విస్తరాకులు కుట్టేవాడు. నారిగాడు ఎప్పుడూ చాలా యాక్టివ్‌గా ఉండేవాడు.



తనతోటి పిల్లలతో ఆడుకోవడం చాలా అరుదు. తోటి కూలీలతో బతుకుదెరువుకు సంబంధించిన చర్చల్లో పాల్గొని శ్రద్ధగా వినేవాడు. అలా కూలికి వెళ్లేవాళ్లతో నారిగాని అంత చిన్న వయస్సు వారెవరూ లేరు. నారిగాడు పనిలో చూపే ఉత్సాహం చూసి అందరూ ఆశ్చర్యపోయేవారు.

* * *

మొన్ననే ఆ ఊరికి బదిలీపై వచ్చిన పట్వారీ రఘు ఈ రోజే పూర్తి సామానుతో ట్రక్కులో వచ్చాడు. ఆ సామానును అద్దె ఇంట్లో సర్దడానికి ముగ్గురు కూలీలను తీసుకురమ్మని ఆ గ్రామసేవకునికి చెప్పాడు. ఆ ముగ్గురు కూలీలలో నారిగాడు కూడా ఒకడిగా వెళ్లాడు.

రఘు నారిగాన్ని చూసి, తీసుకొచ్చిన సుంకరిపై కోప్పడ్డాడు.

"ఇంత చిన్న పిల్లానితో పని చేయించే తల్లిదండ్రులెవరు? వీణ్ని తిరిగి పంపించు. సాయంత్రం వీని తండ్రిని నా దగ్గరికి తీసుకురావాలి" అని సుంకరిని ఆదేశించి, ఆ ఇద్దరితో పని చేయించుకున్నాడు.

* * *

డ్యూటీ పూర్తి చేసుకొని ఇంటి రాగానే, రఘు సుంకరితోపాటు ఓ బక్కచిక్కిన యువ వృద్ధుణ్ని గమనించాడు. అతనే నర్సింలు. నారిగాణ్ని గుడిసెలోనే వుంచి వచ్చాడు.

సుంకరి రఘుతో- "పట్వారి సాబ్... పొద్దుగాల్ల గాపోరని అయ్యను తోల్కరమ్మన్నరు గదా... గీడే... ఈని పేరు నర్సింలు" అని చెప్పాడు.

రఘు నర్సింలుతో "నర్సింలూ... అంత చిన్న పిల్లాడితో పని ఎలా చేయిస్తున్నావయ్యా? బాల కార్మికుల చట్టం ఒకటి వుంది తెలుసా. పిల్లలతో పని చేయిస్తే కఠినమైన శిక్షలు వున్నాయి. నీ కొడుకుతో కూలీ చేయించడం ఆపి, బడికి పంపు. వాడు చదువుకోనీ" అన్నాడు.

"అయ్యా... ఆడు ఈ భూమ్మీద కండ్లు తెర్సిన రోజే, ఆని తల్లి కండ్లు మూసింది. ఉంట్లె గజం జాగ కూడా లేదు. ఏదో బత్కుతున్నం. ఆడో నూరు, నేనో నూరు తెత్తేనే మా కడుపులు నిండుతున్నయి. పని దొర్కని రోజు ఉపాసమే అన్నట్లుంది మా బతుకు. ఓ కాపీ, ఓ పెన్నూ, ఓ పెన్సిలు కొందామన్నా నాతోని కాని పని. ఎట్లా సదిపియ్యాల మా నారిగాన్ని. గాడు పని పెద్దోల లెక్కనే మంచిగ సేత్తడని అందరు మెచ్చుకుంటరు. అయ్యా... గాన్ని బడికి పంపిచ్చుడు నా తోటి కాదు" అని చేతులు జోడించాడు నర్సింలు.

"ఇప్పుడే నీకు మాట ఇస్తున్న నర్సింలూ. నీ కొడుకు చదువు బరువు నీ మీద పడకుండా, దానికయ్యే ఖర్చు నేనే భరిస్తా. వాడు ఎంత పెద్ద చదువులు చదువగలిగినా, దానికోసం నా బిడ్డకు పెట్టినట్లే వానికి కూడా పెడతా. రేపు పొద్దున్న వాన్ని మా ఇంటికి పంపు. వానికి ముందు డ్రెస్సులు, కుట్టించాలి. రేపే నా కూతుర్ని స్కూల్లో చేర్పిస్తున్నా. దానితోపాటే మీ వాన్ని చేర్పిస్తా. వాన్ని పంపడం మరువకు" అన్నాడు, రఘు.

"నీ కాళ్లు మొక్కుతా అయ్యా! గాని బతుకుకు సక్కటి తొవ్వ చూపిచ్చేటందుకు అచ్చిన దేవుడు మీరు. నారిగాన్ని ఇప్పట్నుంచి మీకే అప్పజెప్పుతా" నర్సింలు కళ్లు ఆనంద బాష్పాలను వర్షిస్తున్నాయి.

* * *

రఘు వాళ్లమ్మాయిని, నారిగాన్ని తీసుకొని స్కూల్కెళ్లాడు. స్కూల్లో అడ్మిషన్ ఫారం నింపుతూ, టీచర్ పిల్లలను పేరు అడిగాడు. ఆ అమ్మాయి 'అమూల్య' అని చెప్పింది. ఆ అబ్బాయి "నారిగాడు" అని చెప్పాడు.

అప్పుడు రఘు "వాని పేరు లక్ష్మినారాయణ" అని రాయండి. ఈ రోజు నుండి వీన్ని ఎవరూ నారిగాడు అని పిలవకండి. 'నారాయణ' అని పిలవండి" అన్నాడు.

ఆ క్షణం నారిగాడు 'నారాయణ'గా రూపాంతరం చెందాడు. వాని ముఖంలో వేయి వోల్టుల కాంతి ప్రసారం అయ్యింది.

తనకన్నా నాలుగేళ్ల చిన్నదైన అమూల్యతో ఒకటో తరగతిలో చదువు ప్రారంభించాడు నారాయణ. ఆటలు, పాటలు, చదువు- అన్నింటి లోనూ చురుగ్గా వుండి 'మంచి విద్యార్థి' గా పేరు తెచ్చుకున్నాడు నారాయణ.

**సుంకరి రఘుతో- "పట్వారి సాబ్... పొద్దుగాల్ల గాపోరని అయ్యను తోల్కరమ్మన్నరు గదా... గీడే... ఈని పేరు నర్సింలు" అని చెప్పాడు.**

నారాయణకు ఏ సబ్జెక్టు అయినా ఒకసారి చదవగానే అర్థం అయ్యేది. అలాగే గుర్తుండిపోయేది. నారాయణ- తను ముందు చదివి అమూల్యకు అర్థం అయ్యేలా వివరించేవాడు.

అలా.... అలా... రఘు మార్గదర్శనంలో, ఆర్థిక సహకారంతో నారాయణ చదువు చక్కని పంథాలో సాగిపోతోంది. పదో తరగతిలో 591 మార్కులు సాధించి (అప్పుడు గ్రేడు పాయింట్లు లేవు) రాష్ట్ర స్థాయి ర్యాంకు సాధించాడు నారాయణ. అందుకు హైదరాబాద్లో మంచి పేరున్న ఓ కార్పొరేట్ కాలేజి నారాయణకు ఇంటర్మీడియట్ రెండు సంవత్సరాలు ఉచిత విద్య, ఉచిత వసతి, భోజనం కల్పించడానికి ముందుకొచ్చింది. అమూల్యను అదే కార్పొరేట్ కాలేజీ అమ్మాయిల బ్రాంచిలో ఏడాదికి ఎనభై వేల ఫీజుతో చేర్పించాడు రఘు.

* * *

ఆ రెండు సంవత్సరాలు ఇంటర్మీడియెట్తో పాటు జనరల్ నాలెడ్జి, కరెంట్ ఎఫైర్స్, జనరల్ ఇంగ్లీష్, మ్యాథ్స్ల మీద కూడా మంచి గ్రిప్ సంపాదించుకన్నాడు. ఇంటర్ రెండో సంవత్సరం మొదటి రోజుల్లోనే తన టార్గెట్ యూపీఎస్సీ అనుకొన్నాడు. ఐ.ఎ.ఎస్.కు ఎంపిక కావాలన్నది నారాయణ ఏకైక ధ్యేయంగా మారిపోయింది. ఆ కాలేజీ లోని ఓ లెక్చరర్ సహాయంతో 'యూపిఎస్సీ' పరీక్షకు సంబంధించిన రెఫరల్ బుక్స్ తెప్పించుకున్నాడు. ఇంటర్మీడియేట్ రెండవ సంవతర సిలబస్తో సమాంతరంగా ఆ రెఫరల్ బుక్స్ కూడా చదవడం మొదలు పెట్టాడు.

ఇంటర్లో 982 మార్కులు తెచ్చున్నాడు నారాయణ. రఘు నారాయణ కోరికను తెల్సుకొని, తర్వాత అదే కార్పొరేటు కాలేజి యాజమాన్యందే అయిన ఐ.ఎ.ఎస్. ఎకాడమీలో మూడేళ్ల డిగ్రీతోపాటు ఒక సంవత్సరం ఇంటెన్సివ్ కోచింగ్తో నాలుగేళ్ల ఇంటిగ్రేటెడ్ కోర్సులో చేర్పించాడు.

అమూల్య కూడా అదే ఐ.ఎ.ఎస్. అకాడమీలోనే చేరింది. ఈ కోచింగ్‌తో ఐ.ఎ.ఎస్. రాకపోయినా 'గ్రూప్స్' పరీక్షలైనా సమర్థవంతంగా రాసే అవకాశం వుంది. అందుకే రఘు 'సరే!' అని ఇద్దర్నీ ఆ అకాడమీలో చేర్పించాడు. ఇద్దరూ డిగ్రీలో పోటాపోటీగా చదువుతున్నారు.

* * *

వీఆర్వోగా ఉద్యోగం ప్రారంభించిన రఘు నిత్య విద్యార్థిగా ఎప్పుడూ ఏదో కోర్సు చదువుతూనే వున్నాడు. చదువంటే ప్రాణం అతనికి. అలా ఉద్యోగంలో చేరిన తర్వాతే దూర విద్య ద్వారా డిగ్రీ, మూడు పీజీలు పూర్తి చేశాడు.

ప్రస్తుతం ఓ యూనివర్సిటీ దూరవిద్య ద్వారా, గైడు సహకారంతో సోషియాలజీలో 'బాల కార్మిక చట్టాలు-అమలులో లోపాలు' అన్న అంశంపై ఎం.ఫిల్. చేస్తున్నాడు. పి.హెచ్.డి. పూర్తి చేసి డా॥ రఘు అనిపించుకోవాలని అతని కోరిక. ఇక ఉద్యోగ జీవితంలో మొదట రెవెన్యూ ఇన్‌స్పెక్టర్‌గా, తర్వాత డిప్యూటీ తహసిల్దారుగా రెండు పదోన్నతులు పొందాడు. రెవెన్యూ విషయాల్లో మంచి పరిణతి కల్గిన అధికారిగా పేరు పొందాడు.

నారాయణ, అమూల్యలు డిగ్రీ మంచి మార్కులతో పాసయ్యారు. వారి 'వన్ ఇయర్ ఇంటెన్సివ్ కోచింగ్' ప్రారంభమైంది.

రఘు పొద్దున టీ తాగుతూ దినపత్రికలు ముందేసుకొని చదువుతున్నాడు. రాష్ట్ర విభజన తర్వాత కొత్త జిల్లాల ఏర్పాటు కారణంగా యాభై నాలుగు డీటీలకు 'తహసిల్దార్'గా పదోన్నతినిస్తున్నట్లు ప్రభుత్వం ప్రకటించింది. ఆ లిస్టులో రఘు పేరు కూడా ఉండడం అతన్ని ఆనంద పరవశుణ్ని చేసింది. మధ్య మధ్యలో అభినందనల జల్లులో తడిసిపోతూ ఆ దినపత్రికను తిరగేస్తున్నాడు రఘు.

అప్పుడు దృష్టినాకిర్షించింది... పబ్లిక్ సర్వీస్ కమిషన్ గ్రూప్-1, గ్రూప్-2ల నోటిఫికేషన్.

వెంటనే నారాయణకు కాల్ చేసి, తనని, అమూల్యని గ్రూప్స్‌కి అప్లై చేయమని చెప్పడానికి ఫోను చేసాడు. ఫోన్ చేతిలోకి తీసుకోగానే రింగ్ అయ్యింది. ఎవరా అని స్క్రీన్ మీద చూస్తే 'నారాయణ' అని వుంది. కాల్ లిఫ్ట్ చేయగానే- "నేనిప్పుడే పేపర్లో చూశాను సర్. హార్టీ కంగ్రాచ్యులేషన్స్ ఫర్ ది ప్రమోషన్ యాజ్ తహసిల్దార్" ఎంతో సంతోషంతో విష్ చేశాడు నారాయణ.

"థాంక్స్‌రా. నువ్వు నాకన్నా బాగా ఎదగాలి. అన్నట్టు గ్రూప్స్ నోటిఫికేషన్ పడింది. నువ్వు, అమూల్య అప్లై చేయండి. నీ వేలో నువ్వు చదువు. అమూల్యను కూడా ఎంకరేజ్ చేయి. ఐ విష్ టు సీ యూ యాజ్ ఏ గ్రూప్ వన్ ఆఫీసర్ మినిమమ్. ఆల్ ది బెస్ట్ రా" అని ఫోన్ కట్ చేశాడు రఘు.

* * *

మంచిర్యాల తహసిల్దార్ సీటులో కూర్చుని ఫైళ్లు చూస్తున్నాడు రఘు. నారా యణ నుండి కాల్. "గ్రూప్ వన్ రిజల్ట్ వచ్చింది. మెయిన్స్, ఇంటర్వ్యూ కలిపి నేను ఫోర్త్ ప్లేస్‌లో ఉన్నాను. ఐ యామ్ గోయింగ్ టూ బికమ్ డిప్యూటి కలెక్టర్ సర్. ఇదంతా మీరు పెట్టిన బిక్షనే సర్. మీకు నేను జీవితాంతం రుణపడి వుంటా. సర్... మేడంకి కూడా చెప్పండి" అని నారాయణ అనగానే, రఘు కళ్లవెంట ఆనంద బాష్పాలు జలజలా రాలాయి. తాను పెంచిన మొక్క ఓ వటవృక్షం కాబోతున్నందుకు రఘు లోలోన ఎంతో సంబురపడిపోయాడు.

వెంటనే నారాయణ వాళ్ల నాన్నను పిలిపించి అతనితో- "నర్సింలూ... చూశావా! నీ కొడుకు డిప్యూటీ కలెక్టర్ కాబోతున్నాడు. నా కన్నా పెద్ద ఆఫీసర్. ఇక నీ రాత మారిపోతుంది." అంటూ నర్సింలును కౌగిలించుకొని హృదయపూర్వకంగా హత్తుకున్నాడు.

నర్సింలుకు మాటలు రావడం లేదు. రఘు కౌగిలి నుండి అలాగే కిందకు జారి, రఘు పాదాలపై తన నుదుటిని ఉంచాడు. నర్సింలు కంటి జలధారతో రఘు పాదాలు తడిసిపోయాయి.

మర్నాడే నారాయణ మంచిర్యాల వచ్చి, రఘు సార్ దంపతులు, తండ్రి నర్సింలుల ఆశీర్వాదం తీసుకొని ట్రెయినింగ్‌కని వెళ్లిపోయాడు.

నెల రోజుల తర్వాత వచ్చిన గ్రూప్-2 రిజల్ట్స్‌లో అమూల్య డిప్యూటీ తహసిల్దారుగా ఎంపికైంది. అదృష్టవశాత్తూ తండ్రి తహసిల్దారుగా పని చేస్తున్న మంచిర్యాల రెవెన్యూ కార్యాలయంలోనే పోస్టింగ్ ఇచ్చారు. నారాయణ కాల్ చేసి తండ్రీ, కూతుళ్లను అభినందించాడు.

ఓ రెండు రోజులు సెలవు చూసుకొని, నారాయణ వచ్చాడు.

రఘు నారాయణతో "ఇన్నాళ్లూ నేను నువ్వడిగిన ప్రతీదాన్ని నీకు ఇచ్చాను అనుకుంటున్నా" అన్నాడు.

"అవును సర్... మీరు, నేను అడిగినదాని కన్నా ఎక్కువే ఇచ్చారు ఎప్పుడూ" చెప్పాడు నారాయణ వినయంగా.

"ఇప్పుడు మొదటిసారి నేనొక కోరిక కోరాలనుకుంటున్నాను"

"అదేంటి సార్! అలా అంటారు? నేనేం చేసినా ఈ జన్మలో మీ రుణం తీర్చుకోలేను. నా ప్రాణం అడిగినా ఇవ్వడానికి రెడీ సర్" అన్నాడు నారాయణ భావోద్వేగంతో.

"అది కాదురా... మా యింటి మహాలక్ష్మి 'అమూల్య'ను నీ భార్యగా స్వీకరించు" అని నారాయణ చేతులు పట్టుకుని రఘు తన కోరికను వెళ్లగక్కాడు.

అందుకు స్పందనగా నారాయణ మహదానందంతో "థాంక్యూ సర్. మీ లక్ష్మిని నాకు ఇచ్చి నన్ను నిజమైన లక్ష్మినారాయణగా మార్చాలనుకుంటున్నారు. ఇంత 'అమూల్య'మైన కానుక ఇస్తానంటే వద్దంటానా సార్! నా జీవితంలో ప్రతీసారి నేను కోరుకున్నదానికన్నా ఎక్కువే ఇచ్చారు. ఇప్పుడు కూడా..." నారాయణ రఘుకు వంగి నమస్కరించాడు.

"నాకు పోస్టింగు ఇవ్వగానే పెళ్లి... మరి 'అమూల్య' అభిప్రాయం తెలుసుకున్నారా?" అడిగాడు నారాయణ.

"తన అంగీకారం తీసుకున్నాకే నిన్ను అడిగానురా. పెళ్లి నువ్వెప్పుడంటే అప్పుడే..." అన్నాడు రఘు.

అప్పుడే అక్కడికి వచ్చిన అమూల్య బుగ్గలు ఎరుపెక్కాయి. సోఫాలో మెల్లిగా నారాయణ పక్కన కూచుంది.

* * *

పెళ్లి అయిన తెల్లారి దాదాపు అన్ని దినపత్రికలూ ఒక బాలకార్మికుడు, రఘు చేసిన అన్ని రకాల సహకారాలతో ఆర్డీవోగా రూపాంతరం చెందిన పరిణామ క్రమానికి చెందిన కథనాలు ప్రచురించాయి. రఘు గొప్పతనాన్ని వేనోళ్ల కొనియాడాయి. పెళ్లికి హాజరయి, ఆ మామా-అల్లుళ్ల అనుబంధం తెలియని వాళ్లకు, ఆ రోజు గుసగుసలు పెట్టిన చాలా మందికి ఆ పత్రికా కథనాలే సమాధానమిచ్చాయి.

లక్ష్మినారాయణ ఆర్డీవో పోస్టుతోనే సంతృప్తి చెందలేదు. యూపిఎస్సీ ప్రిలిమ్స్, మెయిన్స్ దాటి ఇప్పుడు ఇంటర్వ్యూకి ప్రిపేర్ అవుతున్నాడు. అంటే త్వరలోనే లక్ష్మినారాయణను ఐ.ఎ.ఎస్.గా చూడబోతున్నామన్నమాట. ■

# ఈ వారం కవిత్వం

## యుద్ధమేఘం

**కాలాన్ని** కాసేపు
వెనుకకు తిప్పుకుందాం
గత విషాదం మనకు
కొంతైనా కనబడుతుంది

మాటల కోతలు కాసిన్ని
పరీక్షకు పెట్టుకుందాం
కిస్సా కుర్సీకా అని
స్పష్టంగా తెలిసిపోతుంది

సరిహద్దుమీది కవాతు జవాను
నెత్తురోడుతూ కనిపిస్తాడు

సుందర కాశ్మీరం దీపకళిక
మతం మంటల్లో మండుతుంది

దుఃఖిత మనస్విని
జీలంనది
కర్ఫ్యూ కింద
నలుగుతోంది
ఉరీతల్లి కళ్లలోంచి
ఉప్పొంగుతోన్న ప్రతీకారం

రక్తమూ... కన్నీరు కలిసి
ప్రవహించే భూమంతా
యుద్ధమేఘం కమ్మిన
భయానక మృత్యుఘోష

తల్లిగుండెకోత త్రాసు
ఎటు మొగ్గుతుందో
ఊహాలకందని పికాసో చిత్రం

మానవ హక్కుల ముసుగులు
ఎంత కాలం విసురుతాయి రాళ్లు
దురాక్రమణ ద్వారం తెరిచిన పాక్

ఇంకెంత కాలమీ సాముగరిడీ?

అంతర్జాతీయ ముఖాలు కొన్ని
ఆత్మావలోకనం అద్దం ముందు
కాళ్లు తెగిపడిన ఒంటరి తోడేళ్లు

మనం మన గెట్టుమీదే నిలబడి
నిద్ర దుప్పటి దులుపుకునేలోపే
అమ్మకడుపు దింపుడుకళ్లమవుతుంది

రక్తం రుచిమరిగిన నమ్మకం పులి
వమ్ముపంజా విసురుతోంది
మృత్యువు కన్నీటిలో తడిసిన తల్లి
శిగపువ్వు బిడ్డకోసం పరితపిస్తోంది

– పరమాత్మ

## కత్తి-కలము

**కత్తి** పట్టి మీసం మెలేసేవానికి ఆవేశం ఎక్కువ
కలం పట్టిన కవికి సామాజిక బాధ్యత ఎక్కువ
కత్తికి రెండు వైపులా పదును వుండవచ్చు
కవి కలానికి అన్ని వైపులా పదునే

కత్తులతో యుద్ధాలు, మారణహోమాలు జరుపవచ్చు
కలంతో అక్షరాలను ఆయుధాలుగా మార్చవచ్చు
కత్తులతో కుత్తుకలు కోయవచ్చు
కలంతో కవిత్వం అల్లవచ్చు

కత్తులు పట్టి మార్పు సాధించిన చరిత్ర తాత్కాలికం
కలం రాత ఎన్ని మార్పులు తెచ్చిందో అదే విప్లవాత్మకం
కరవాలం ఝుళిపిస్తే రక్తపాతం జరుగుతుంది
కలాన్ని కదిలిస్తే సాహిత్యం పుడుతుంది
కత్తి కఠిన హృదయులకే ఆయుధం
కవికలం ప్రతి హృదయాన్ని కదిలించే నవరస అక్షరధామం.

– కంచనపల్లి ద్వారకానాథ్

## పట్టుగూడు

**మాట** కొన్నిసార్లు మసిగా
అనవసరమైనదిగా అదనమైనదిగా కనిపిస్తుంది
గూడులోని గొంగళిపురుగుకు
పదాలతో పని లేదు
పట్టుగూడులో పవళిస్తూ
నింపాదిగా సౌఖ్యపు దారాన్ని నేసే
పట్టుపురుగుకూ అంతే.

ప్రతి పదమూ పరిపుష్టమై
పరిపూర్ణంగా సిద్ధమై
రూపాంతరం చెందుతుంది
సీతాకోక చిలుకలాగా.

– ఆంగ్లమూలం: అనీ జార్జ్
తెలుగు సేత : ఎలనాగ

## మన 'ప్రేమ యాత్ర'

**నీ** చూపులు కరపత్రాలౌతున్నాయ్
కనిపించని నా ఆచూకీ కనుగొనడానికేమో...
నీ ఊహలు పాదయాత్ర సాగిస్తున్నాయ్
వినిపించని నా పలుకుని పరామర్శించడానికేమో!!

నీ తలపులు దండయాత్ర చేసేస్తున్నాయ్
తొలగించని నా ఒంటరితనాన్ని మట్టుబెట్టేందుకేనేమో....
నీ ఆలోచనలు అమృతం కురిపిస్తున్నాయ్
జీవచ్ఛవాలైన నా ఆశల్ని తిరిగి బతికించాలనేమో...!!

నీ నవ్వులు గుబాళిస్తున్నాయ్
వాడిపోయిన నా గుండెకు పరిమళమద్దాలనేమో....
నీ మౌనాలు సప్తస్వరాలౌతున్నాయ్
మూగబోయిన నా మనసుకు సరిగమలవ్వాలనేమో!

నీ పాదముద్రలు పవిత్రాక్షరాలౌతున్నాయ్
గమనమాగిపోయిన నాకు గమ్యమవ్వాలనేమో....
నీ అలికిడులు ఆనందానికి తాళాలౌతున్నాయ్....
కదలికలాగిపోయిన నా కలలకు ఊపిరవ్వాలనేమో...!!

నీ స్పర్శలే సాహిత్యాలౌతున్నాయ్....
నిస్తేజమైన ఏకాంతంలో ఉత్తేజమవ్వాలనేమో...
నీ రెప్పల చప్పుళ్లే స్వాగతమంటున్నాయ్
నా గుండె సవ్వడిలో కలిసి ఏకమవ్వాలనేమో....!!

– యు.ఎల్.నరసింహా గౌడ్




# కృతజ్ఞత

**- పి.ఎల్.ఎన్.మంగారత్నం**

**ఆరోజు** ఆఫీసులో పని చేసుకుంటూ వుండగా, పక్క సీటులో వున్న రాజారావు దగ్గరకి ఎవరో వచ్చి చాలా సేపటినుంచి కబుర్లు చెప్ప సాగాడు. రాజకీయాల దగ్గర నుంచి సినిమాల వరకూ- వచ్చిన పనేదో చూసుకుని వెళ్లక. విసుగ్గా అనిపించింది. నా పని డిస్టర్బ్ అయిపో తోంది. అయినా ఏం చేస్తాం! ఇది పబ్లిక్ ఆఫీసు. పైగా లంకంత బిల్డింగు, బ్రిటిష్‌వాళ్లు కట్టించినది. కావలసినంత ఖాళీ. జనాలు ఫ్రీగా వస్తూ...పోతూ ఉంటారు. ఎవరినీ ఏమీ అనడానికి వీల్లేదు. ప్రజా స్వామ్యం. అసహనంగా అతనివైపు దృష్టి సారించాను. సన్నగా... పొడుగ్గా... తెల్లటి లాల్చీ షరాయ్, చేతి వేళ్లకి పెద్ద ఉంగరాలతో ఒక సారి చూస్తే గుర్తుండిపోయేలా వున్నాడు. అతను నన్ను గమనించే స్థితిలో లేడు. అతని వాగ్ధాటి అతనిదే. చేసేది లేక నా పని చేసుకో వడం మొదలుపెట్టాను. అయినా ఏకాగ్రత కుదరలేదు. ఇక లాభం లేద నుకుని "రాజారావుగారూ! మీ ప్రోగ్రెస్ రిపోర్ట్ తయారయ్యిందా?" అడి గాను. కబుర్లలో పడి పని మర్చిపోయాడేమోనని. అది ఎంత అర్జెం టుగా హెడ్ ఆఫీసుకి పంపితే అంత మంచిది" అన్నాను.

"అదే తయారు చేస్తున్నా. ఇప్పుడే రెడ్డిగారు వచ్చారు" అంటూ పక్కన నిలబడి వున్నతన్ని చూపించాడు. అతని రిపోర్ట్ ఆలస్యం అవడా నికి వచ్చినతనే కారణం అన్నట్టు. ఏమనుకున్నాడో ఏమో ఆ రెడ్డిగారు నా వైపు తిరిగి "నమస్తే మేడం" అని విష్ చేసాడు.

మళ్లీ ఎప్పటిలాగే రాజారావుతో కబుర్లు. మాటల్నిబట్టి అతను ఏదో సర్టిఫికెట్‌కోసం వచ్చాడని, చాలా రోజులుగా తిరుగుతున్నాడని అర్థమయ్యింది.

నా రిపోర్ట్ పూర్తి అవడంతో సూపరింటెండెంట్‌గారి దగ్గర పెట్టడానికి వెళుతూ "అతని పని ఏదో చూసి పంపవచ్చుగా! ఎంతసేపు నిలబెట్టుకుంటారు" అని.

పావుగంట తరువాత నా రిపోర్ట్ సంతకాలు పెట్టించుకుని వచ్చేసరికి ఆ రెడ్డిగారు అనబడే ఆ వ్యక్తి నా గది గుమ్మం ముందు నిలబడి దర్జాగా సిగరెట్టు కాలుస్తున్నాడు. ఈ ఆఫీసు అతని స్వంత జాగీర్దారు అన్నట్టు. ఆ వాసనకి కడుపులో తిప్పినట్టయ్యింది. నాకు చిర్రెత్తుకొచ్చింది. ముక్కుకి జేబు రుమాలు అడ్డం పెట్టుకుంటూ "ఏమండీ! ఇది ఆఫీసు, మీరు పబ్లిక్ ప్లేసెస్‌లో ఇలా సిగరెట్టు కాల్చకూడదు. బయటకు వెళ్లి కాల్చుకోండి" అని కాస్త కటువుగానే చెప్పాను. ఇప్పటివరకు కబుర్లతోనే విసిగిస్తున్నాడనుకుంటే ఇక సిగరెఉట్ట వాసనలు కూడానా అని.

"సరే మేడం! బయటకు వెళ్తాలే" అంటూ నా మాటను మన్నించి గౌరవంగా బయటకు వెళ్లిపోయాడు.

అయినా కోపం ఆగలేదు... రాజారావుని రెండు చివాట్లు వేసాను. "బయట వాళ్లను ఎందుకు అంతంతసేపు సీటు దగ్గర నిలబెట్టుకోవడం. పనేదైనా వుంటే చేసిపెట్టి త్వరగా పంపెయ్యవచ్చుగా! మనకి డిస్టర్బెన్స్ తగ్గుతుంది" అని. సమాధానంగా నవ్వి "ఏమి చెయ్యాలి, మా దోస్తుకు కావలసినవాడు. పైగా 'పైరవికారుడు' పని వున్నా, లేకపోయినా కలిసి పోతున్నాడు. వచ్చేవాళ్లను రావద్దని అనలేం కదా!" అన్నాడు.

రాజారావు స్థానికుడు. వున్న ఊరిలోనే పోస్టింగు. అతనికి అందరూ కావాలి. ఇలానే కబుర్లలో పడి ఆఫీస్ పని పెండింగ్‌లో పెట్టేస్తుంటాడు. అతని దగ్గర చాలా సబ్జెక్టులు పెండింగులోనే ఉంటాయి. సీనియర్ అసి స్టెంట్ సీటు. ఆఫీస్ మొత్తానికీ కీలకమైనది. వర్కూ ఎక్కువే. వరదలా వచ్చి పడుతుంటాయి, దరఖాస్తులు. ఒకసారి మా ఆఫీసర్‌గారు, రాజా రావు సీటులోని పెండింగు ఫైళ్ల అన్నీ తెప్పించి, ఓ సెకండు సాటర్ డే నాడు ఆఫీస్ స్టాఫ్ అందరినీ ఆఫీసుకి పిలిపించి క్లియర్ చేయించారు. ఆ రోజు రాజారావుని తిట్టుకోనివాళ్లు లేరు, ఓ సెలవు పోయిందని. అయినా అతని పద్ధతిలో మార్పు లేదు.

* * *

కాలం ఎవరికోసం ఆగదన్నట్టు శ్రావణమాసం వచ్చింది. చెల్లెలి పెళ్లి ఉందంటూ రాజారావు ఇరవై రోజులు సెలవు పెట్టాడు. రాజారావు సీట్లో అని సెలవు కాలానికి పద్మనాభరావుని ఇంఛార్జిగా వేస్తారు. చాలా మందిలానే ఆ మోతుబరి రైతు 'రెడ్డి'గారు కూడా అప్పుడప్పుడు కనిపి స్తూనే వున్నాడు. కాకపోతే నా కోపం కాస్త రుచి చూసాడేమో! సిగరెట్టు చేతులో వుంటే చెట్ల కిందే పచారీలు చేసేవాడు.

పద్మనాభరావు సీట్లోకి వచ్చిన కొద్ది రోజులకే, రాజారావు పేరబెట్టిన పెండింగ్ వర్కు చాలావరకూ పూర్తి చేసాడు. అతని రెగ్యులర్ సీట్‌లానే ఇంచార్జి సీట్ కూడా కళకళలాడింది. 'కష్టే ఫలి' అనుకునే మనిషి.

ఈ నేపథ్యంలోనే ఆ రెడ్డిగారి ఫైల్ కూడా కదిలి ఆ సర్టిఫికెట్ ఏదో చేతికి వచ్చినట్లుంది. చాలా సంబరపడిపోయాడు. ఆ ఊపులోనే అక్కడే ఉన్న అటెండర్ దేవయ్యను పిలిచి- "ఒరేయ్ దేవుడూ! అందరికీ చాయ్ తే...పో" షరాయి జేబులోంచి డబ్బులు తీసి, ఇస్తూ ఆజ్ఞాపించాడు.

దేవయ్య అతని ఆజ్ఞని శిరసావహించాడు. "అలాగే సారూ!" అంటూ డబ్బులు అందుకున్నాడు సంతోషంగా. అతని సంతోషం అతనిది. ఈ వంకతోనైనా కాస్త చిల్లర దొరుకుతుందని.

అతని టీ తాగే ఆలోచన నాకు లేదు. అందుకే ఓ చిన్న క్లారిఫికేషన్ వంకతో పక్కనే వున్న ట్రెజరీ ఆఫీస్‌కి వెళ్లా. పావుగంటపైనే కూర్చున్నా. పని పూర్తవడంతో తిరిగి సీటులోకి వచ్చేసాను. అప్పుడే అటెండర్ దేవయ్య టీ దుకాణం అబ్బాయితో అరడజను టీలు పట్టించుకొచ్చాడు. ఆ అబ్బాయి అందరికీ ఇస్తూ నా టేబుల్ పైనా ఒకటి పెట్టబోయాడు. తప్పించుకోవాలని అనుకున్నా తప్పేలా లేదు.

"లంచ్ టైం దగ్గర పడిందిగా! ఇప్పుడెందుకు. వద్దు. మరెవరికైనా ఇచ్చేయ్!" అన్నాను. ఆ అబ్బాయితో గ్లాసు అందుకోకుండానే.

"తీసుకోండి మేడం. మన రెడ్డిగారే తెప్పించిన్రు. పద్మనాభరావు సారు ఈయన పని దబ్బున చేసిండు. సాల్వేన్సీ సర్టిఫికేట్ చేతికొచ్చింది. ఆ ఖుషిల చాయ్‌లు" వివరించాడు దేవయ్య.

"అబ్బే వద్దయ్యా! ఇప్పుడే ట్రెజరీ ఆఫీస్‌లో తీసుకున్నాను" చెప్పాను. వాళ్ల మాటవరసకు కూడా అనలేదు. వేడి చాయ్ నోరూరిస్తున్నా అలాగే చెప్పాలనిపించింది. సిగరెట్ల మీద వున్న అలర్జీతో అతన్నీ బాగానే విసుక్కున్నాను మరి.

ఆ మాటకి గది గుమ్మం దగ్గరే నిలుచున్న రెడ్డిగారు ముందుకొచ్చి "చాయ్‌దేముంది మేడం! ఎన్ని సార్లయినా తాగొచ్చు" అన్నాడు 'తప్పదు' అన్నట్లు. ఇక చేసేది లేకపోయింది. సన్నటి ముసురు.. ఉదయం నుంచి పూల జల్లులా పడుతూనే ఉంది. అల్పపీడనం అంది వాతావరణ శాఖ. శరీరంలో వెచ్చదనం నాకూ అవసరమే. గ్లాస్ చేతిలోకి తీసుకుంటూ కృతజ్ఞతగా "పోనీలెండి ఇప్పటికైనా మీ పని పూర్తయింది" అన్నాను నవ్వుతూ. అతని టీ తాగుతూ కూడా ఇంకా అతన్ని తిట్టుకోకూడదు కదా. ఇన్నాళ్లూ పరిస్థితుల వల్ల రిజర్వుడుగా వున్నందుకు అతనిపట్ల ఏర్పరచుకున్న కోపం నన్ను నేను తిట్టుకునేలా చేసింది ఆ క్షణం. ఎంతైనా నాకు కాస్త గర్వం కదా! ఇంట్లోనూ అదే అంటారు. పోనీలే అతని పనీ అయిపోయింది. ఇక ఆఫీస్‌కి వచ్చి సుత్తి వేయడం వుండదు. అతని సిగరెట్ హాబిట్ నాకేమిటి ఇబ్బంది. ఇలా- ఆలోచిస్తూ పోతే అతని మీద కోపం దూదిపింజలా క్షణాల్లో ఎగిరిపోయింది. మబ్బులు వీడిన ఆకాశంలా మనస్సు తేలిక పడింది. అయినా అలా ఉండకపోతే పబ్లిక్ మన మాట వినరు కదా! ఉద్యోగార్థం నేనలా ప్రవ ర్తించాను. వ్యక్తిగత ద్వేషం కాదు. కాబట్టి, నేను చేసింది తప్పేంకాదు అని సరిపెట్టేసుకున్నాను. అలా... ఆలోచిస్తూ టీ తాగుతుంటే ఎప్పుడూ అలవాటుగా వినే చప్పుడు... నాకు నచ్చని ఆ చప్పుడు.

సర్రున అగ్గిపుల్ల తీసి వెలిగించిన చప్పుడు. అంటే...నేను అతనితో కాస్త అభిమానంగా మాట్లాడడం అతనికి ధైర్యాన్నిచ్చిందేమో! అతని పాత అలవాటు అతను మానుకోలేకపోయాడు. నా గదిగుమ్మం ఉన్న బయట మెట్టుమీద నిలబడి, తనదైన స్టైల్లో ధైర్యంగా సిగరెట్టు వెలిగిం చాడు. అక్కడే నిలబడి పొగ వదులుతున్నాడు. బయట కురిసే సన్నని వానకి తడిసిపోతాడని. నా మాటను మన్నించి బయటే నిలబడినా పొగమాత్రం లోపలికి వస్తోంది. అతని టీ గొంతు దిగిన తరువాత జేబురుమాలుతో ముక్కు మూసుకోవడం తప్పించి ఏమీ చేయలేకపోయాను. ■

# వాయుచ్ఛిద్ర వేధ అంటే?


## వాస్తువార్త

వాస్తువిద్వాన్ సాయిశ్రీ

డా॥ దంతూరి పండరినాథ్

3-2-4, కింగ్స్‌వే, సికింద్రాబాద్- 3

సెల్స్: 9885446501/ 9885449458




**వాస్తు శాస్త్రంలో 'గాలివాటం' విశిష్టత ప్రత్యేకంగా చెప్పబడింది. వాయుపీడనం, వాయు సాంద్రత, వాయుగతి, వాయు గమనాలు ప్రాణి జీవితాన్ని, జీవన విధానాన్ని, ఆరోగ్యాన్ని, ఆలోచనలను ప్రభావితం చేస్తూ వుంటాయి.**

గాలి ఆడని గదిలో జీవితం సాగించేవారు అనేక విధాల అనారోగ్యాలకు గురవుతూ వుంటారు. గాలి రావడానికి ఒక గవాక్షాన్ని (కిటికీని) ఏర్పాటు చేయటం వలన ప్రయోజనం వుండదు. ఆ కిటికీకి ఎదురుగా మరొక కిటికీని ఏర్పాటు చేసినప్పుడు మాత్రమే గాలి ఒక కిటికీగుండా గది లోపలికి వీచి, మరొక కిటికీ గుండా బయటకు వెళుతుంది. ఈ నిరంతర ప్రక్రియ వలన ఆ గదిలోని గాలి ఎప్పటికప్పుడు మారుతూ వుండటం వలన మెరుగయిన ఆరోగ్యంతో జీవించ గలుగుతాం (ప్రవాహం లేని నీరు, కదలని గాలి విషతుల్యమైనవి)

సాధారణంగా ఎక్కువ శాతం గాలివాటం పశ్చిమం నుండి తూర్పుకు లేదా దక్షిణం నుండి ఉత్తరానికి లేదా నైరుతి నుండి ఈశాన్యానికి వీస్తూ వుంటుంది. మనం గాలికోసం, వెలుతురు కోసం అమర్చే గవాక్షాలు గృహానికి పడమర వైపు, దక్షిణం వైపు గోడలకు తప్పకుండా వుండాల్సిందే! ఈ విధంగా పశ్చిమ, దక్షిణ దిశల్లో గవాక్షాలు లేకపోవటంచేత 'వాయుచ్ఛిద్ర వేధ' దోషం కలిగిన గృహంలో నివసించేవారు కలుషితమయిన గాలిని నిరంతరం పీల్చుకొన వలసి వుంటుంది. అందుచేత



వారికి వారి సంతతికి అనేక రకాల అనారోగ్య సమస్యలు ఉత్పన్నమయ్యే అవకాశం ఉంటుంది. ఇలాంటి దోషమున్న గృహంలో నివసించేవారు ఈ అనారోగ్యాలతో బాధపడు తున్నట్లయితే ఆ గృహానికి పశ్చిమ, దక్షిణ దిక్కుల్లో గోడలకు గవాక్షాలు ఏర్పరచు కున్నట్లయితే వాస్తు దోషం సవరింపబడుతుంది. గృహంలోకి గాలి ధారాళంగా వీస్తుంది. అనారోగ్య సమస్యలు క్రమంగా తగ్గుతాయి. ఆలోచనా విధానంలో చెప్పుకోతగినంత మార్పు వస్తుంది. అనుకూలమయిన నిర్ణయాలు తీసుకోగలుగుతారు. ఈ విధంగా జీవితంలో పురోగతిని ఆశించవచ్చు.

### సమస్యలకు పరిష్కారం!?

**అంజయ్య గౌడ్ - కర్నూలు**

ప్రశ్న: ... అప్పటినుండి మాకు ఏదీ కలిసిరావటం లేదు. ఆరోగ్య సమస్యలు, ఆర్థిక సమస్యలు, బాధలు. అన్ని విధాలుగా మా కుటుంబం కష్టాలను అనుభవి స్తోంది. దయచేసి నా సమస్యలకు పరిష్కార మార్గం సూచించండి.

**జవాబు:** ప్రస్తుతం మీరు పశ్చిమ ముఖద్వారం కలిగిన మేడపై గల అంతస్తులో నివాసముంటున్నారు. ఆ గృహానికి కుబేర స్థానమయిన ఉత్తరంలో టాయిలెట్స్ వున్నాయి. ఈశాన్యంలో కూడా ఒక బెడ్ రూమ్ వున్నది. ఈశాన్యం మూతపడింది. ఇలాంటి దోషాలున్నపుడు సహజంగానే మీకు బాగుండదు. మార్పులకు వీలుకాదు.

కాబట్టి ప్రత్యామ్నాయ పద్ధతులు పాటించటం వలన మెరుగయిన ఫలితాలను సాధించవచ్చు. రావలసిన ధనం ఆగిపోవటం, అప్పు తీసుకున్నవాళ్లు తిరిగి ఇవ్వకపోవటం మొదలయిన ఆర్థిక సమస్యలకు చాలా వరకు వాస్తు దోషాలే కారణమవుతాయి. వాటిని సరిచేసుకోవటం మంచి పద్ధతి. అలా వీలు కానప్పుడు ప్రత్యామ్నాయ పద్ధతులు మెరుగయిన ఫలితాలనిస్తాయి. ఒకసారి ఆ ఇల్లు మాకు చూపిస్తే పరిష్కారం చెప్పడానికి వీలుంటుంది.

### ఇంటికెదురుగా కొండపై శివాలయం....!

**లలిత - తూ.గో.జిల్లా**

ప్రశ్న: మాది పల్లెటూరు. దక్షిణ, పడమర వీధులున్నాయి. చిన్న రేకుల ఇల్లు. ఇంటికి సుమారు ఒక కి.మీ. దూరంలో కొండపైన తూర్పు ముఖంగా శివాలయం వున్నది. ధ్వజస్తంభం కూడా వున్నది. మా ఇంటికి ముందు వరుసగా ఇంకా రెండు వీధులు గల గృహాలున్నాయి. అందరూ గుడికి ఎదురుగా వున్న గృహానికి శివుని దృష్టివల్ల కీడు జరుగుతుందని అంటున్నారు. వీరి మాటల వల్ల నిద్ర, ఆహారం లేకుండా బాధపడుతున్నాను. కొండపై దూరంగా వున్న శివుని దృష్టివల్ల దోషం వుంటుందా?

**జవాబు:** అంత దూరంలో కొండపైనున్న గుడిగోపురం, ధ్వజస్తంభం నీడలు ఉ॥ 9 గం॥ నుండి సా॥ 3 గం॥ల లోపు మీ గృహంపై పడే అవకాశం లేదు. అందువల్ల ఆ దోషమేమీ వుండదు. కనుక మీరు నిశ్చింతగా వుండవచ్చు.

### గల్లాపెట్టె ఎక్కడ పెట్టాలి?

**సుబ్బారావు - శ్రీకాకుళం**

ప్రశ్న: ... మిగిలిన అర్ధభాగం మేం సొంతంగా పిండి మిషన్‌లు అమర్చుకొని నడుపుతున్నాం. మా షాపులో మీరు చెప్పిన విధంగా నైరుతిలో యజమాని కూర్చోవడానికి, గల్లాపెట్టె అమర్చుకోవడానికి వీలు కాలేదు. ఈ షాపులో అక్కడ కాకుండా ఇంకా ఏ స్థానంలో గల్లాపెట్టె అమర్చుకోవాలి?

**జవాబు:** ఈశాన్యం తప్ప వాయువ్య, ఆగ్నేయ దిక్కుల్లో వరుస ప్రాధాన్యంలో తూర్పు లేదా ఉత్తరాభిముఖంగా కూర్చునే విధంగా 'గల్లాపెట్టె'ను అమర్చుకోవచ్చు. ■

వాస్తువిద్వాన్ డా॥ దంతూరి పండరినాథ్ పాఠకుల సమస్యలకు ఆదివారం 'వాస్తువార్త'లో సమాధానాలిస్తారు. ఈ కింది కూపన్ జతచేసి సమస్యలు పంపవలసిన చిరునామా: సాయిశ్రీ వాస్తు కన్సల్టెన్సీ, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్-3

వాస్తువార్త

పూర్తి పేరు: ----------------------------------------

పుట్టినతేదీ:------------------- ఊరు: --------------

జన్మనక్షత్రం:----------తల్లిపేరు:--------------------

చిరునామా: ------------------------------------

------------------- ఫోన్: ----------------------

# పర్సనల్ పాయింట్


చల్లా సుబ్రహ్మణ్యం
1 సి-ఐక్యూ టవర్స్, 3-4-540,
నారాయణగూడ, హైదరాబాద్-27
మొబైల్: 9866362224/ 9553662224
challascounsel@gmail.com
www.challascounsel.com




# నెగిటివ్ కలలతో...

పి.బి - సేలం జిల్లా, తమిళనాడు

ప్రశ్న: నా వయసు 29. నేను ఐ.టి.(IT) కంపెనీలో జాబ్ చేస్తున్నాను. నా గర్ల్ ఫ్రెండ్, నేను ఇద్దరం ఒకే కాలేజీలో చదువుకున్నాం. తను నాకంటే ఒక సంవత్సరం చిన్న. ఇద్దరం ఒకే కంపెనీలో జాయిన్ అవ్వాలని ప్రయత్నం చేస్తున్నాం. మాది నాలుగేళ్ల ప్రేమ. మా ఇద్దరి వ్యక్తిత్వాలు (personalities) వేరైనా... మాకు ఒకరంటే ఒకరికి గౌరవం, నమ్మకం. నేను ఏ పని చేసినా నెమ్మదిగా ఆలోచించి చేస్తాను. తను చాలా త్వరగా నిర్ణయం (decision) తీసుకుంటుంది. నేను ఎవ్వరితోనైనా కలవడానికి టైం తీసుకుంటాను, తను ఎవరితో, ఎప్పుడు, ఎక్కడ, ఎలా మాట్లాడాలో త్వరగా క్యాచ్ చేస్తుంది. ఇలా... మా ఇద్దరికీ చాలా తేడా లున్నా- మాకు మనస్పర్థలు ఏమీ లేవు. మా ఇద్దరికి అవగాహన (understanding levels) చాలా ఎక్కువ. సర్దుకుపోయే తత్వం ఇద్దరికీ ఎక్కువే. ఇక అంతా బాగుంది అనుకున్న టైంలో మా ఇద్దరినీ ఒక విషయం డిస్టర్బ్ చేసింది. మా కులాలు వేరైనా మా పెద్దవాళ్లు మా పెళ్లికి అడ్డు చెప్పలేదు. మొదట్లో టైం పట్టినా రెండు నెలల్లో అంతా 'ఒకే' అన్నారు.

ఒక నెల రోజుల నుంచి నేను ప్రేమించిన అమ్మాయి 'తనకి నిద్రలో ఓ కల వచ్చింది. ఆ కలలో మేం ఇద్దరం భయంకరంగా గొడవ పడుతున్నామని' చెప్పింది. ఆ రోజు నుండి తను చాలా డిస్టర్బ్ అయింది. చాలా నెగిటివ్ (negative) గా ఆలోచిస్తోంది. పెళ్ల య్యాక ప్రేమ తగ్గిపోతుందనీ, గొడవలు జరుగుతాయని భయపడుతోంది. తన ఆలోచనల స్థాయి ఎంతదాకా వెళ్లిందంటే "ఇక పెళ్లి వద్దు, ఎన్నాళ్లైనా ఇలాగే ఉందాం" అని అంటోంది. తన మాటలు, ప్రవర్తనా చూస్తే చాలా బాధగా ఉంది. ఈ విషయంలో నుంచి తనని ఎలా బయటికి తీసుకురావాలో అర్థం కావట్లేదు. డిసెంబరులో మా పెళ్లి అనుకున్నాం. తన పరిస్థితి రోజురోజుకి దిగజారి పోతోంది. నేను అన్ని రకాలుగా తనకి సర్ది చెప్పాను. కానీ నా మాట వినడం లేదు. నేనేం చేయాలి?

జవాబు: బాబూ... ప్రస్తుతం నువ్వు ఏం చెప్పినా తనని పెళ్లి చేసుకోవాలనే స్వార్థంతో ఏదో సర్దిచెప్పే ప్రయత్నం చేస్తున్నావు అనుకుంటుంది. ఇక్కడ తన అనుమానాలు, భయాలు సమంజసమా? కాదా? అని కాదు ఆలోచించాల్సింది. తన అనుమానాలు తను కావాలని తెచ్చుకుంటున్నవి కావు. తనకి నీ పట్ల వున్న ఇష్టం, ప్రేమ తగ్గి అలా మాట్లాడ్డం లేదు ఆ అమ్మాయి. తన ప్రమేయం లేకుండా సాగుతున్న ఆలోచనలు... ఏర్పడుతున్న అపోహలు... కలుగుతున్న భయాలు... వీటిని పోగొట్టడానికి నువ్వు తగిన వ్యక్తివి కాదు నాన్నా... అంటే... నా ఉద్దేశం ఇంటి చెట్టు సొంత వైద్యం పనికిరావు అంటారు చూడు... ఇదీ అలాంటిదే! ఆలస్యం చెయ్యకుండా తనని తీసుకుని రా. సైకోథెరపీ (psychotherapy) ద్వారా ఆమెని మామూలు స్థితికి తీసుకువద్దాం.

## నేను డిప్రెషన్‌లో నుంచి బయటికి రాగలనా?

ఎం.వీ.పి - హైదరాబాద్

ప్రశ్న: నా వయసు 28. ఒక ప్రైవేట్ అడ్వర్టైజింగ్ (Advertsing) కంపెనీలో పని చేస్తున్నాను. నా వృత్తిరీత్యా creativity తో పని చేయడం నాకు అవసరం. అదే నా జాబ్ కూడా. కుటుంబ స్థితి, ఆర్థిక పరిస్థితులు బాగున్నాయి. కానీ రెండు నెలల నుంచి నేను మానసికంగా ఏదో తెలియని భయం... ఆందోళనకి గురవుతున్నాను. ఆ ఆందోళన కలిగినపుడు నా ఆలోచనలన్నీ చాలా లోతుగా... నెగెటివ్‌గా వెళతాయి. ఆ రోజంతా డల్‌గా ఉంటుంది. కానీ అది మళ్లీ మర్నాడుకి వుండదు. తర్వాత నుంచి ఉత్సాహంగా వుంటుంది. ఆఫీస్‌లో కూడా చాలా చురుగ్గా నా పనులు చేసుకుంటాను. నా జాబ్ క్రియేటివిటీకి సంబంధించినది కాబట్టి ప్రతిరోజు స్ట్రెస్‌ఫుల్ (stressful) గానే ఉంటుంది. అయినా ఆ ఒత్తిడిని తట్టుకుని ఉత్సాహంగా పని చేస్తాను. మళ్లీ పది రోజుల తర్వాత అలాంటి ఫీలింగ్స్ (feelings)... ఆందోళనలోకి వెళ్లిపోతున్నాను. రెండు రోజుల తర్వాత మామూలుగా అయిపోతాను. డాక్టర్‌ని కలిస్తే డిప్రెషన్ అని నిర్ధారించారు. మందులు వాడాను. ఏం లాభం లేదు. నాకు చాలా భయంగా వుంది. నేను ఈ స్థితిలో నుంచి బయటకి రాగలనా?

జవాబు: తప్పకుండా.... బయట పడగలవు. ఏ ఆందోళనా లేని మనిషి భూమ్మీద వుండదు. అప్పుడప్పుడు నిరుత్సాహంగా, జీవితం నిరాసక్తంగా అనిపించడం మనిషికి సహజం. ఎప్పుడన్నా రెండు రోజులు అలా వుంటే అంత కంగారు పడక్కర్లేదు. అలాంటి స్థితి కనీసం ఒక నెల రోజులు కొనసాగితే దాన్ని క్లినికల్ డిప్రెషన్ (clinical depression) అని నిర్ధారించే అవకాశం వుంది. అలాంటి పరిస్థితి నీకు వస్తే జనరల్ డాక్టర్‌ని కాకుండా సైకియాట్రిస్ట్‌ని కలవడం మంచిది. క్లినికల్ డిప్రెషన్ లక్షణాలు ఏమిటంటే...

* నేనెందుకూ పనికిరాను అనే ఆలోచనలు.
* అపరాధ భావం.
* ఆకలి లేకపోవడం, బరువు తగ్గడం
* ఆనందాన్నిచ్చే పనులు, మనుషుల పట్ల ఆసక్తి, ఇష్టం తగ్గడం.
* ఏకాగ్రత, స్థిరత్వం లేకపోవడం.
* సరిగా నిద్ర పట్టకపోవడం.
* చిన్న చిన్న విషయాలైనా... అతిగా ఆలోచించడం
* వృత్తి, ఉద్యోగంలో తీవ్రమైన ఒత్తిడి
* ఆలోచనా సరళి సక్రమంగా, సమంజసంగా లేకపోవడం.
* జీవితం వృథా... ఇక చనిపోవడం ఒక్కటే మార్గం అనే ఆలోచనలు.

ఇలాంటి లక్షణాలు ఏవైనా ఒక నెల రోజులైనా కొనసాగితే సైకియాట్రిస్ట్‌ని తప్పనిసరిగా కలవాల్సి ఉంటుంది. ప్రస్తుతం నువ్వున్న స్థితికి క్లినికల్ డిప్రెషన్ అనిపించడం లేదు.

ప్రాణయోగ (pranayoga) కౌన్సెలింగ్ ద్వారా ఆత్మవిశ్వాసం (self confidence), రిలాక్సేషన్ (relaxation), నేర్చుకొని ప్రాక్టీస్ చేస్తే నువ్వు మామూలుగా అయ్యే అవకాశం తప్పకుండా వుంది. మానసికం(psychological)గా, శారీరకంగా (physical) గానీ నైపుణ్యాన్ని, ధైర్యాన్ని, నిన్ను నువ్వు ఎలా ప్రేమించుకోవాలి (How to love yourself) లాంటి విషయాలు ప్రాణయోగా ద్వారా 15-20 రోజుల్లో నేర్పిస్తాను. ఆలస్యం చేయకుండా వచ్చి కలువు. ■

# పద మథనం-126

**- నిర్వహణ: వాడ్రేవు ఉమాశంకర్**

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | | 4 | | ■ | 5 | 6 |
| | ■ | 7 | | | ■ | | ■ | 8 | | |
| ■ | 9 | ■ | ■ | 10 | | ■ | 11 | ■ | | ■ |
| 12 | | | ■ | | ■ | 13 | | 14 | | |
| ■ | | ■ | 15 | | | | ■ | | ■ | ■ |
| 16 | | | ■ | ■ | ■ | | ■ | 17 | | 18 |
| | ■ | ■ | 19 | ■ | ■ | | ■ | | ■ | |
| 20 | 21 | | | | 22 | ■ | 23 | | 24 | ■ |
| 25 | | ■ | | ■ | 26 | | | ■ | | ■ |
| | ■ | 27 | | ■ | | ■ | 28 | 29 | | |
| 30 | | ■ | 31 | | | ■ | ■ | 32 | | ■ |

## ఆధారం

### అడ్డం

1. పుత్తడి కాదు నిరకూటము.. నిత్యం వాడే ఒక లోహం-3
3. జీవంతో కళకళలాడే కలువపువ్వు-4
5. తపస్వి-2
7. తనువు నుండి పుట్టినది-3
8. ఒకేదానికి అలాగే తయారుచేయబడ్డ విడి ప్రతి-3
10. గురువులు చెప్పే మంచిమాట-2
12. తెగువ చూపించరా డింభకా-3
13. హిందీవాళ్ల వాయింపు, పాటా... చిందులు వేయడానికే-5
15. మోక్షాన్ని కోరుకునేవాడు, మోక్షగామే-4
16. బలరాముడు దున్నే నాగలి-3
17. పూర్వకాలం పెళ్లిళ్లకి కొబ్బరాకులతో వేసేది-3
20. ముక్కుకి పెట్టుకునే నగ-6
23. షడ్రుచుల్లో చింతపండు, మామిడికాయ గుణాలు-3
25. నెమలి విప్పే నగరి-2
26. శ్రీరాముని మిత్రుడు, నిషాధరాజు-సీతారాముల్ని గంగని దాటించిన ఘనుడు-3
27. చివరికి తోక తెగిన పర్ణుడు-2
28. కొంతమంది కలిసి చేసే వ్యవసాయం.. ఉమ్మడి వ్యవసాయం చేయడమే వారి మతం-4

### నిలువు

1. ఉదయాన్నే ఆవిరిమీద ఉడికే అల్పాహార పదార్థం-2
2. కింద నుంచి పుట్టుకొస్తున్న చెమ్మ-2
3. రాజులందరినీ జయించి ధర్మరాజు చేసిన యాగం-5
4. అందమైన అమ్మాయి, పసందైన చేప పడాలంటే ఇది వెయ్యాలి-2
5. ఏం చేస్తాం... మన జాతకం ఇలా తిరగబడింది-4
6. వెళ్లకు... ఆగు-2
11. నార్త్ అమెరికాలో మన తెలుగు సంఘం-2
13. భయంతో అరిచే అరుపు గాక, మధ్యలో ఊరికే అరుస్తారా?-4
14. స్కూలు మాస్టారు... ఒకప్పుడు బతకలేకే ఈ ఉద్యోగం చేసాడు-5
16. ద్వాపర యుగంలో మన ఢిల్లీ-6
18. అందరికీ ఠక్కున నోటమ్మట వచ్చే ఒక కంపెనీ బట్టల సబ్బు-2
19. రావణాసురునిచేత శయనోత్సవం జరిపించుకున్న తమ్ముడు-5
21. సంపద, లక్ష్మీదేవి-2
22. అడిగిందల్లా ఇచ్చే కర్ణుడి నైజం తిరగబడింది-4
23. 20 అడ్డంలోని నగకి బదులుగా పెట్టుకునే చిన్న పుల్ల-3
24. ప్రాచీనం, పాతకాలం-4
29. గదిలా ధ్వనించే మనసు-2

## పద మథనం - 124 సరైన సమాధానాలు రాసినవారు

1. సి.గిరిజా శంకరరావు-డా॥ ఎ.ఎస్.రావ్ నగర్ 2. వి.సుజాత-భైరాగిపట్టెడ 3. ఎస్.పి.గంగిరెడ్డి, ఎన్.ధనలక్ష్మి-రాజమండ్రి 4. వి.బి.టి.సుందరి-సరూర్‌నగర్ 5. సి.రాజలక్ష్మి, ఇ.శ్యామ సుందర్, యస్.యస్.ఎగ్గోని-పుప్పాలగూడ 6. బి.యాదగిరి-ఉప్పల్ 7. టి.వెంకట సూరయ్య నాయుడు, టి.కనకవల్లి-మల్లాపూర్ 8. ఎస్.టి.పి.కృష్ణమాచార్యులు-నాగోల్ 9. పి.రాజేశ్వర రావు-అలకాపురి 10. సి.సరోజ, సి.సుబ్బారావు, సి.ప్రవీణ్‌కుమార్, సి.పవన్‌కుమార్, సి. లక్ష్మీనరసింహమూర్తి-సనత్‌నగర్ 11. ఎస్.పి.మణికంఠ, ఎస్.పి.శివాని, పి.గీత-మల్లాపూర్ 12. ఎ.అన్నపూర్ణ-రామారావుపేట 13. కె.లింగమ్మ, కె.శివాజీరెడ్డి-మల్లాపూర్ 14. డా॥ ఆర్. శారదా సురేంద్రకుమార్-కర్నూలు 15. ఎ.బాలసుబ్రహ్మణ్యం-కూకట్‌పల్లి 16. జె.కుమార స్వామి-పిడుగురాళ్ల 17. పి.శ్యామలాదేవి-మదనపల్లి 18. బి.కె.మూర్తి-హుజూర్‌నగర్ 19. బి. కృష్ణమూర్తి-అద్దంకి 20. కె.సుధాదేవి-చీరాల 21. పి.కె.సాంబశివరావు-కూకట్‌పల్లి 22. కె.ఎస్. మధుసూదనాచారి-హన్మకొండ 23. ఎస్.శ్రీనివాసశాస్త్రి-గుంతకల్

## పద మథనం - 125 సమాధానాలు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 అ | 2 ల | మం | 3 ద | ● | 4 సిం | 5 హా | స | న | 6 ము |
| 7 క | క్ష | ● | క్ష | ● | 8 గ | ని | ● | ● | స |
| ళి | ● | 9 హా | య | న | ము | ● | 10 ది | 11 ఆ | ● |
| ● | 12 బా | ● | ల | ● | ● | 13 భ | వ | న | 14 ము |
| 15 అ | కా | ర | ము | ● | 16 పో | ● | ● | 17 క | ద్మ |
| కా | ● | ● | ● | 18 చీ | వు | 19 రు | క | ట్ట | ● |
| 20 శం | 21 ఖో | 22 శం | 23 క | ర | ● | మా | ● | ● | 24 పే |
| ● | 25 జ | క | న | ● | 26 క | లు | 27 వ | రే | దు |
| 28 పె | సం | ● | 29 కాం | 30 తి | ● | ● | గ్రా | ● | ● |
| న్నా | ● | 31 ముం | గి | స | ● | 32 హా | ము | కా | టు |

పేరు:

ఊరు:

